# పక్రి

[ కథల సంపుటి ]

రచయిత:
ధనికొండ హనుమంతరావు

పబ్లిషర్సు:
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

## విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. చక్రి | ... ... | 1 పే॥ |
| 2. తోడుదొంగలు | ... ... | 58 ,, |
| 3. జారేకాష్లు | ... ... | 69 ,, |
| 4. పవిత్రాశయం | ... ... | 31 ,, |
| 5. సమస్య | ... ... | 91 ,, |
| 6. న్యాయం - ధర్మం | ... ... | 111 ,, |

# చక్రి

ఏదో పాఠం చెప్తున్నాడన్న మాటేకాని—రామదాసు మనస్సు మనస్సులో లేదు. తను చెప్పే పాఠం తనకేసరిగ్గా అర్థం కాక పోతున్నా—క్లాసులో కుర్రవాళ్ళుమాత్రం గురువుగారి ఆందోళనను గుర్తించి కాబోలు—నిశ్శబ్దంగా కూర్చొని తలలూపుతూ తమకు పాఠం బాగా అర్థమౌతూ న్నట్టు నటిస్తున్నారు.

చంద్రమతి తన ఏకైకపుత్రుడు లోహితుణ్ని కాటికి తీసుకుపోనటాన్ని గూర్చి చెప్తున్నాడు. ఇంక చెప్పలేక కళ్ళు నీళ్ళతో నింపాడు. కుర్రాళ్ళు కూడా బిక్క మొగాలు పెట్టి దుఃఖాన్ని నటిస్తున్నారు. చంద్రమతి తినలాంటి దౌర్భాగ్యు రాలే కాబోలు! తను కూడా వరసాగ్గానలుగుర్ని కాటికి మోసుకు పొయ్యారు. పాఠంమీది ధ్యాసం అంతా వెనుకటి విషయాల్ని తరచటంలోకి పరుగెత్తింది.

ఇంటిదగ్గర్నుంచి మళ్ళీ చీటీ వొచ్చింది! మీరు వెంటనే రావాలి; చక్రి బతకడేమో; నాకు భయం వేస్తోంది...''

మొదటి రెండు కబుర్లకూ తను ఎల్లాగో మనస్సు చిక్క బట్టుకొన్నాడు. కాని యీమూడోదాంట్లో వున్న కఠిన పదాలు ఆయన హృదయానికి కగకు ములుకులయ్యాయి. చక్రి బతకడేమో! అని లోపల గొణుక్కొని దృష్టినంతట్నీ

ఇంటివైపు మరల్చాడు. చేతులోవున్న పుస్తకం దానంతటదే జారి కిందపడ్డది. ఎదురుగుండావున్న ముసలిగోడ గడియారం వైపు నూశాడు; మెల్లిగా ఊగుతూ కాలాన్నే మందగమనంతో లాక్కుపోతోంది; ఇంకా గంటం పావుదాకా ఆ కుర్చీని వదలరాదు; ఆ గడియారానికూడా తన మీద దయరాదు; ఏమో ఆలోచించి అన్నాడు; "మీరు ఇళ్ళకు వెళ్ళండి—"

మరి రెండు నిమిషాలకు రామదాసు ఒకడే క్లాసులో నిలబడ్డాడు.

మెల్లిగా ఉత్తరీయాన్ని తీసుకొని కళ్ళనీళ్ళు తుడుచుకొని, బరువైన బొందిని లాక్కుంటూ బైటపడ్డాడు.

చెరువుగట్టున నడుస్తూన్న హరి. "కక్కా! అల్లావున్నావేం ?" అనేదాకా, రామదాసు ముఖం పైకెత్తనేలేదు.

రామదాసుకు ఒక్కసారి పోయినప్రాణం లేచొచ్చినట్టయి, నవ్వేందుకు వ్యర్థప్రయత్నంచేసి, "హరీ! ఎక్కడున్నావయ్యా—యీ అయిదు రోజులూను ?" అన్నాడు.

ఆయన ముఖంలోని వ్యాకులతను అర్థంచేసుకునేందుకు ప్రయత్నిస్తూ హరి అన్నాడు—

"స్నేహితుడి పెళ్ళికి వెళ్ళా—"

"నీ యీ స్నేహితులమాట మరిచేపొయ్యావా ?" అని తన కష్టాన్ని చెప్పుకోలేక భార్య రాసిపంపిన చీటీసు హరి చేతికిచ్చాడు.

హరి దాన్ని చదివి చకితుడై, "ఇంతకుముందే వొచ్చాను కక్కా! నీకీ సంగతే తెలీను. రా—వెళ్దాం" అంటూ నడక సాగించాడు.

## 2

భర్తనూ, హరినీ చూడగానే భైరవాంబ—కొడుక్కు-విసురుతూన్నదల్లా లేచి, విసనికర్రను అవతలుంచి, "హరీ! వొచ్చావా—నాయనా! భగవంతుడు నిన్ను ఇప్పుడు పంపాడా? నీపాదాలమీద పడతాను—ఏనాటికైనా నీ ఋణం తీర్చుకుంటాను! ఈ జన్మాన చేతకాపోతే వెయ్యి జన్మాలు కుక్కనై నీ ఇల్లు కాచి ఋణవిముక్తురాల్నవుతాను-నీ కడుపున పుడతానుబాబూ—ఈ ఒక్కణ్ణీ బతికించు; నీ చిన్నతమ్ముడికి ప్రాణం పొయ్యి బాబూ!" అని వలవలా ఏడ్వసాగింది.

"నన్నేమనుకుంటున్నావ్—పిన్నీ! నేనేం భగవంతుణ్ని కాదు—నా పాదాలమీద పడటానికి నీకు మతిపోతోందా పిన్నీ—ఇలాటి మాటలంటే నేనిప్పుడే బైటికిపోతాను."

రామదాసు హరి రెండు చేతుల్నీ పట్టుకొని, "ఇవ్వే కాళ్ళనుకో హరీ! మరేమీ అనుకోకు—" అన్నాడు.

ఆ దంపతులకు వారి మాటల్లో ఏమైనా మాధుర్యం వుందని తోచిందేమో కాని—హరి హృదయానికి మాత్రం అవ్వి బాకుల్లాగు స్ఫురించాయి.

"నాకు సిగ్గుపుట్టించకండి—మీరు నన్నేమీ కో[illegible]క్కర్లేదు. బతిమాలక్కర్లేదు! ప్రాధేయ పడక్కర్లేదు. నాకు తెలుసు—చక్రికి సేవచేయవలసిన బాధ్యత ఇదే చెప్తున్నాను: మీరు మరోసారి ఇల్లా అంటే మాత్రం—నేను సహించలేను—"

"సరే బాబూ—నిన్నే నమ్ముకున్నాం." భైరవాంబ అన్నది.

హరి మాట్లాడకుండా వెళ్ళి రోగి మంచంమీద కూర్చున్నాడు. ఐదురోజుల్లోనే చక్రిలో ఇంత మార్పా? వాడి ముఖంలోని కళా, కాంతీ వికాసమూ ఏమైనాయి? ముఖమంతా పాలిపోయి గుర్తించేందుకు వీల్లేని ఆకారాన్ని తాల్చింది. చక్రివిడిచే ఉష్ణవాయువులు హరిచేతిని సోకుతున్నాయి; వాడి ఫాలభాగంమీద మోపిన చేతికి జ్వరతీవ్రత తెలుస్తూనేవుంది.

"చక్రీ!" అన్నాడు మెల్లిగా—నీరసించిన వాడి శరీరాన్ని తాకుతూ.

చక్రి మెల్లిగా కళ్ళు తెరిచి, ఏదో మాట్లాడబోయి పెదిమల్ని నాలికతో తడిచేసుకొని, జాలిగా, బాధగా, దీనంగా హరివైపుచూసి—మౌనంలోనే వినయంగా కనురెప్పల్ని వాల్చాడు.

హరి రోగిని పరీక్షించాడు: అనేక ఊహాలు అతనిలో మెరుపుల్లా మెరిసాయి! ఈ విషజ్వరాన్నిగూర్చి అతను జ్ఞాపకం చేసుకుంటున్నాడు.

గాపుకాసూ, భైరవాంబ ముఖాల్లోని ఆత్రుతను కనిపెట్టి అన్నాడు; "మరేంభయలేదు పిన్నీ! అనవసరంగా ఆశల న్నింటినీ చంపుకొని అనుర్దా పడుతున్నారు—ఇప్పుడేవెళ్ళి మందు తీసుకొస్తా—"

మెల్లిగా లేచి వెళ్తున్న హరిని భైరవాంబ లోలోపల్నే దీవించింది.

రామదాసు అన్నాడు "హరి ఇంత మంచివాడూ, జాలి గలవాడూ అనుకోలే. ఏదో చిన్నతనంలో నాదగ్గర చదువు కొన్నాడు; నేనంటే భయభక్తుల్తో కూడిన గౌరవాన్ని చూపుతాడు. వాడితండ్రి పెంపుడుపోయి పెద్దఆస్తిని ఆర్జించినా—ఇంత నమ్రత చూపుతాడనుకోలే—"

భార్య అంది:—"భగవంతుడికి మనమీద దయవుంది."

ఎదురుగుండా గోడమీద వేలాడుతూవున్న విష్ణువున్న బొమ్మను ఉద్దేశించి ఆమె లోపల, "దయారహితుడివైనా మాతృత్వాన్ని భగ్నం చెయ్యబోక స్వామీ! వాడిబాధను చూచేందుకు మాత్రమే "నన్ను బతికించొద్దు. నలుగుర్ని ఇచ్చావ్—లాక్కున్నావ్; ఈ వొక్కణ్నే మాత్రం మిగుల్చు తండ్రీ! వాడిబదులు—నన్ను— చంపు; వాడిబాధను నాకివ్వు సహిస్తాను. నాచేతుల్లో అల్లారుముద్దుగా పెరిగిన వాడికి మాత్రం ఆబాధవొద్దు—నా సర్వస్వమూవాడే! నేను చెప్పలా? తెలీదా నా హృదయం నీకు?" అనుకొని కంట నీరు కార్చింది.

హరి తిరిగి వొచ్చి కూర్చొని, "ఇన్నాళ్ళనుంచీ మందేమీ ఇవ్వలేదా?" అని అడిగాడు.

భైరవాంబ పొడి గొంతుకతో అంది: "అప్పలాచారి ఇచ్చాడు; ఇదేంరోగమో కాని తిరుగుముఖం పట్టకపోను—రోజురోజుకూ అధికమౌతోంది. ఏమిటో—వాడిబాధ మాట్లాడడు; చెప్పడు. ఎవరైనా వొచ్చి పేరుపెట్టి పిలిచినా, లేపినా—మెల్లిగా కనురెప్పలకిందినుంచి చూసి మళ్ళా మూస్తాడు. ఉన్నట్టుండి అమితంగా కాళ్ళు చేతులూ కొట్టుకుంటాడు."

"ఆహారం యేమీ ఇవ్వలేదా?"

"వైద్యుడు ఇవ్వొద్దన్నాడు—"

దారిసే పోతూన్న జానికయ్యను పిల్చి హరి, "నాసైకిలేసుకొని వెళ్ళి ఈచీటీలో రాసినమందునూ, ఒక డజను బత్తాల్ని తీసుకురా; ఇక్కడున్నట్లు రావాలి—"అని జేబులోంచి పదిరూపాయిల కాగితాన్ని తీసి జానికయ్యకు ఇచ్చాడు.

భైరవాంబ చేతిగాజుల్ని తీస్తూ అంది: "ఒద్దు హరీ; సువ్వొద్దు—జానికయ్యా; ఇవుగో యీగాజుల్ని తీసుకు వెళ్ళి తాకట్టుపెట్టి తీసుకురా—లేకుంటే అమ్మేయ్—తెగనమ్మ ఎంతొచ్చినా సరే—"

తన గ్రాంటు ఇంకా కాలేదేమో అని రామదాసు ఆలోచిస్తున్నాడు: "నేనేం చెప్పాను పిన్నీ—మళ్లీ మొదటికే

వస్తున్నావ్-'' అన్నమాటలు భైరవాంబ సాహసాన్ని అరికట్టాయ్- జానికయ్య వెళ్ళాక,

హరి : ఈ పదిరోజుల్నుంచీ మాకు నిద్రాహారాలు లేవు: కళ్ళెలా ఎర్రపడ్డయ్యో చూడు. నాకేదో భయంవేస్తోంది. మీ ఉమాపతీ వైద్యం మీద నమ్మకం వుంది; నీమీదే నాఆశలన్నీ ఉన్నాయ్...'' అంటూ భైరవాంబ కొడుకు పక్కలో కూర్చొని విసరనారంభించింది. రామదాసు చెయ్యివిరిగిన కుర్చీలోనే కూర్చొని తలొంచుకొని అశ్రువుల్ని రాలుస్తున్నాడు.

''మరేం భయంలేదు లే—పిన్నీ!'' అని హరి మరో మంచంమీద కూలబడ్డాడు.

ఇల్లంతా నిశ్శబ్దంతో ఒకగంట గడిపింది. ఎక్కడి మనుషు లక్కడ నిశ్శబ్దంగా కూర్చున్నారు. భైరవాంబ కంటినుంచి ఏకధారగా కారేనీరు కుర్రవాడి ఫాలభాగాన్ని తడిపేస్తోంది.

ఇప్పటికి జానికయ్య తెచ్చినమందును — సిరంజ్ లోకి ఎక్కించటంలో హరి నిమగ్నుడై వున్నాడు.

ఉన్నట్టు వుండి చక్రి కాళ్ళూ చేతులూ కొట్టుకోసాగాడు. భైరవాంబ వాణ్ని గట్టిగా కావిలించుకుంటూ. ''ఏం— నాయనా ?'' అంది.

హరి అదిరిపడి రోగి మంచం దగ్గరకు పరుగెత్తాడు. తల తెగిపడ్డ జంతువు మొండెంలాగు చక్రి కొట్టుకుంటూన్నాడు. ఈ దృశ్యాన్ని చూడలేక రామదాసు రెండు కళ్ళనూ గట్టిగా

మూసుకున్నాను. చక్రి చెయ్యిపట్టుకు చూశాడు: నాడి అంద కుండా ఎగబ్రాకి పోతోంది: హరికి యేమీ పాలుపోకుండా వుంది. ఎగశ్వాసతో చక్రి యీ లోకాన్ని కడసారి చూసి, తుదిసారి యీ గాలిని పీలుద్దామనీ వ్యర్థప్రయత్నం చేసి— అందరికి నమస్కరిస్తూ కళ్ళను శాశ్వతంగా మూశాడు. ఆ నిర్జీవ శీతల శరీరాన్ని స్పృశింపలేక హరి చేతిలోని సిరంజీని వదిలేశాడు.

భైరవాంబ, "నాయనా—నాయనా—" అంది ఎవ రున్నారు సమాధానం ఇచ్చేందుకు? హరి తలవాల్చి ఇవత లికి వొచ్చాడు.

భార్య మాటల్లోని దుఃఖాన్ని విని, రామదాసు కళ్ళు తెరిచి పరిస్థితి నంతట్నీ గ్రహించి, "పొయ్యాడా?— హరీ!...పొయ్యాడా—నా బాబు? ఎంత గారాబంగా పెం చాం—హరీ! మాట్లాడవేం? ఇంతేనా—యీ జన్మకు?" అని లోలోపలే విలపింపసాగాడు.

భైరవాంబ పూర్తిగా మతిలేనిదానిమల్లే లేచి, గోడ మీద . విష్ణువు బొమ్మను ఉద్దేశిస్తూ.

"నలుగుర్ని పొట్టను పెట్టుకున్నావ్ — చాల్లేదా? మమ్మల్ని ఏడిపిస్తే కాని నీకు సంతోషం కాదా? నిన్ను నమ్మామే! నిన్ను పూజించామే! వాడు—వాతోపాటే నీకు పూజచేసేవాడే! వాడు నీ మెడలో ఐదు రోజుల క్రితం వేసిన పూలదండ ఇంకా వుందే — కళ్ళు పొయ్యాయా నీకు!

చూడు—నీ పూజకోసం వాడు నాటిన పూలమొక్కల్ని తీసుకు పోయ్యేవాడివి ఎందుకిచ్చేవ్? వాడి బదులు నన్ను చంపమన్నానే! వాడికి నీపోరు పెట్టుకోలేదే? అంతా అంతా——మరిచిపోయి... కృతఘ్నుడవై...వాణ్ణి...ఆ చిన్నివాన్ని చంపకపోతే... ఛీ! నిన్నా నమ్మటం? దిగు— ఆ గోడ మీంచి—'' అని రోషంలో బొమ్మను తీసి అద్దం పగుల కొట్టి, కాగితాన్ని ముక్కలు ముక్కలుగా చింపి కాలితో రాచింది.

కోపం చల్లారగానే మళ్ళీ యీ వాతావరణానికి లొంగి వెంటనే కొడుకు దగ్గరకు పరుగెత్తి; ఆ శవాన్ని కదుపుతూ, ''నాతండ్రీ! నిన్నేవ రేమన్నార్రా? నీకేం తక్కువ చేశా మని మమ్మల్ని దిగతొక్కి పోయావ్! ఒక రోజు కాదు— ఒక నెలకాదు— ఒకఏడు కాదు — పదేళ్ళు పడరాని పాట్లుపడి పువ్వుల్లో పెట్టి పెంచినందుకా యీ శిక్ష! ఈ ప్రపంచంలో యీ పదేళ్ళ పాపకే తావులేక పోయిందా? ఇన్ని పర్వతాల్నీ ఇన్ని నదుల్నీ మోస్తున్న భూమాతకు వీడొక్కడే భారమైనాడా? ఎవరి జోలికి పోని, ఎవరికీ ఏ హానీ చెయ్యని, ఒకరిని మాట అని కానీ ఒకరిచేత పడి కానీ ఎరుగని—ఏ పాపమూ ఎరగని పసిపాపవీ డొక్కడే దేవుడి దృష్టికి దూరమైనాడా? నా చిట్టితండ్రీ! ఇక ముందు నువ్వు లేక మేమెల్లా జీవిస్తాముురా బాబూ—నా కడుపు కాల్చిపొయ్యాడు—'' అని జుట్టంతా పీక్కుంటూ ఏడ్వ సాగింది.

రామదాసుకూడా ఉత్తరీయం చాటున ఏడ్వనారంభిం చాడు; హరికి కన్నీరాగటం లేదు. భైరవాంబ కేకలకు. కేకలకు ఇరుగు పొరుగులు పరుగెత్తుకొచ్చారు. అందరూ తలో విధంగానూ సానుభూతి చూపటం మొదలెట్టారు.

ఇప్పటికీ సాయంత్రం నాలుగు గంటలైంది. సూర్యుడు తీక్షణతను క్షీణింపజేసుకుంటూ—మెల్లి మెల్లిగా పశ్చిమా ద్రిని ఎగబ్రాకుతున్నాడు. ఏడ్చి ఏడ్చి భైరవాంబ ముఖ మంతా కందిపోయింది; రామదాసుకు దుఃఖంతో నోరు పిడచ గట్టుకుపోతోంది.

మెల్లిగా హరిని అవతలికి పిలిచి రామదాసు అన్నాడు. ''హరీ; వాడు నన్ను జీవచ్ఛవాన్ని చేసిపోయ్యాడు; ఒక్క పని చేసిపెట్టు నాయనా— చేతుల్లో నలుగుర్ని పెంచాను; అందర్నీ భూదేవి గర్భానికి బలిపెట్టాను. ఇంక నేనీవన్ని చెయ్యలేను. ఈ పెంచిన చేతుల్తోనే వాడి శరీరాన్ని గోతిలో పెట్టి కాలితోతొక్కి మలినంచేసిన మట్టితో దాన్ని పూడ్వలేను హరీ: నువ్వేంచేసినా సరే! వాడి కళేబరాన్ని కుక్కలూ, నక్కలూ పీక్కుతిన్నా నా కష్టమే! ఎల్లాగైనా దాన్ని బైటికి పంపేమార్గం చూడు బాబూ! మొఖాన రాసిన గీతను ఎల్లా చెడుపుకుంటాం? నాకు నేనే సమా ధానం చెప్పుకోలేకుండా వున్నాను; మీపిన్నిని సమాధాన పరచటంకూడా నీ వంతే—''

''అదంతా నేను చూస్తాను కాని—కన్నా—నువ్వు ఇల్లా దుఃఖిస్తే పిన్నిగతేం కావాలి—

రామదాసుకు మొలబంటి దుఃఖంలో మోకాటి బంటి సంతోషం కలిగి, తల ఊగించాడు.

ఇప్పటికే స్కూలు కుర్రాళ్ళు కూడా వచ్చి, తమ స్నేహితుడికోసం కన్నీరు కార్చారు.

చక్రి మృతశరీరాన్ని తీసుకుపోతుంటే, భైరవాంబ అసుతంగా విలపిస్తూ, ''ఎంతమంది వుండి ఏం చెయ్యగలరు! నా బాబు! చూడు—ఆదుకునేందుకు ఎంతమంది స్నేహితులొచ్చారో! కని పెంచి పెద్దచేసిన తల్లిదండ్రులే అక్కర్లేనప్పుడు—స్నేహితులెందుకు ?—వెళ్తావా! నా తండ్రీ ;... ఇంక కనపడవా? ఎన్నాళ్ళు పెంచాను; నన్నూ, నాన్ననూ...అందర్నీ విడిచిపోతావా...'' స్పృహ తప్పినట్టు నేల వ్రాలింది.

# 3

హరి రాకను చూసి పాలిపోయిన ముఖంలోంచి ఒక వేడి నిట్టూర్పును విడుస్తూ రామదాసు, ''అయిందా నాయనా? ఆ స్మశాన గర్భంలో వాణ్ణి భద్రంగా పడుకోబెట్టి మళ్ళీ పైకి రాకుండా చేశావా?''—అన్నాడు.

హరి మౌనంతోనే మెల్లిగా తల వూపాడు,

అప్పటికి భైరవాంబ మళ్ళీ యీ లోకంలో మనిషయింది. పూర్తిగా దుఃఖంతో పూడుకుపోయిన ఆమెగొంతు నుంచి మాటలు సరిగ్గా ఉచ్చరింప బడటం లేదు.

"హరీ ; ఇంక నేను ఏడ్వలేను. కడుపులో పెట్టుకు పెంచాను. దేవుడేవొచ్చి తనకు బలివ్వమన్నాడు. మాట్లాడకుండా చేతులారా ఇచ్చేశాను—" అని భైరవాంబ రెండు కళ్ళనూ గట్టిగా మూసుకుంది.

ఇప్పటికి ఇరుగు పొరుగులంతా సర్దుకున్నారు. ఒక పావుగంట దాకా ఇంట్లో నిశ్శబ్ద దేవత తాండవించింది. పూర్తిగా అస్తమించిన సూర్యుణ్ణి వెక్కిరిస్తూ సందె చీకట్లు అలముకోసాగాయి. నక్షత్రాలు ఒక్కొక్కటిగా తమ మిణుకు మిణుకు కాంతితో ఆకాశంలోంచి తొంగి చూస్తున్నాయి.

హరి లాంతరు వెలిగిస్తూ అన్నాడు : "కక్కా ! చీకటి పడ్డది ! భోజనం తయారు చెయ్యమని ఇంటికి కబురంపాను. ఇప్పటికి సిద్ధమై వుంటుంది; స్నానాలు చెయ్యండి; వెళ్దాం—"

రామదాసు దీర్ఘంగా గట్టిగా నిట్టూర్చి, "నాకు ఆకలి కావటం లేదు బాబూ ?" అన్నాడు.

భైరవాంబ అంది : "చక్రి తినకపోతే మాకు అన్నం సయిస్తుందా బాబూ ! ఈనాటినుంచి వాడు లేకుండా బతకటమే భారమైపోతోంది."

"అన్నీ మరిచిపోవాలి పిన్నీ ! బతికివున్నాళ్ళూ – పొట్ట వున్నన్నాళ్ళూ—ఆకలి తప్పదు. మీపాదాలమీద పడ

తాను—నన్ను కాదనకండి. నా మీద మీకేమైనా ప్రేమ వుంటే—దాన్ని చూపవలసిన సమయమిదేనని చెప్తున్నాను.''

* * *

నీరు కారుతూన్న కళ్ళతోనే నాలుగు మెతుకులు నోట్లో వేసుకొని ఆరాత్రికి మీరెల్లాగో ఆకలిబాధ తీర్చుకున్నారు.

హరి అన్నాడు! ''ఈరాత్రి నేనుకూడా ఇక్కడే పడుకుంటా—''

భైరవాంబ, ''పడుకో బాబూ—ఆ మంచంమీద—చక్రి రోజూ పడుకునే మంచంమీద పడుకో. ఈనాటినుంచీ దానిమీద ఎవరు పడుకుంటారా అని చూస్తున్నా—'' అంది. మాట్లాడకుండా హరి మంచంవాల్చుకు పడుకున్నాడు.

ఉన్నట్టుండి భైరవాంబ చీరచెంగు నేలమీద పరుచుకు పడుకొని వెక్కి వెక్కి ఏడుస్తూ దొర్ల నారంభించింది.

హరి లేచి కూర్చొని అన్నాడు: ''ఇదుగో పిన్నీ—చెప్తున్నాను: పోయినవాళ్ళు పోగా ఇదంతా ఉన్నవాళ్ళ చావుకు వొచ్చినట్టుంది. కటిక నేలమీద పడి దొర్లటం దేనికి ? నువ్వక్కడ పడుకుంటే నేను ఇక్కడ—యీ నేల మీద పడుకోవాల్సి వుంటుంది—''

''నన్ను ఏడ్వనీ: నాయనా! హృదయంలో ఇంత దుఃఖం ఇమడటం లేదు—ఇదంతా కన్నీటి రూపంలో వెళ్లు

పడనీ బాబూ! నాకు మంచంమీద నిద్రపట్టదు. ఇక్కడే పడుకోనీ—నన్ను కాదనకు హరీ!'' అని భైరవాంబ స్థిమితంగా ఒత్తిగిలి పడుకొంది. మరేమీ మాట్లాడకుండా హరి గట్టిగా ఊపిరి పీల్చి మేనువాల్చాడు.

రామదాసుకి వీళ్ళెవరి గోలా పట్టనట్టు పడుకొని ఇంటి చూరును చూస్తూ ఏదో దీర్ఘంగా ఆలోచించసాగాడు. ఆయనకు పూర్తిగా మతిభ్రమ కలిగినట్టుంది. దాదాపు అర్థరాత్రివరకూ ఆయన ఆలోచనా సాగరంలోని ఏ అలా ఒడ్డు జేరనీలేదు. ఊరంతా మాటు మణిగినా పొలాల్లో నక్కలు కూసే భయంకర నాదాలూ, అమిత వేగంతో వీస్తూన్న ఈదరగాలి చెట్ల కొమ్మల్లోంచి దూసుకుపోతూ చేసే శబ్దమూ విన్పిస్తూనే ఉన్నాయి. బైట కారుచీకట్లు క్రమ్ముకొన్నాయి. రామదాసు ఇది తన పాలిట కాళరాత్రి కాబోలు ననుకున్నాడు.

అటూ ఇటూ దొర్లుతూ బలవంతాన్నైనా నిద్రాదేవిని లాక్కొందామని ప్రయత్నించాడు కాని—రామదాసుకు ఆమె భయపడి దూరదూరంగా పోసాగింది. తడిసిపోయిన తలగడాను చూసుకుంటూ లేచి కూర్చున్నాడు.

భైరవాంబ సొమ్మసిల్లి నిద్రపోయింది. హరి మేలుకున్నాడో లేదో కాని—అతని కళ్ళుమాత్రం మూసేవున్నాయి. మరోలాంతర్ను వెలిగించుకొని—రామదాసు—పక్కగదిలోకి వెళ్ళాడు.

చక్రి చదువుకునే పుస్తకాలు చిందరవందరగా పడివున్నాయి. ఒక్కొక్కటే తీసి బొత్తిగా పెట్టాడు. ఆపుస్తకాల్ని సర్దుకునేవాడుకానీ, అంత మంచి దస్తూరి రాసేహస్తం కానీ ఇంకి లేదు! ఆ చాపమీదకూర్చొని ఇంకెవరు చదువుకుంటారు? గోడమీద పెన్సిల్‌తోనూ, కిటికీ చెక్కమీద సీమసున్నంతోనూ చక్రి రాసుకున్న పేర్లు ఇంకా కన్పిస్తూనే వున్నాయి. పెట్టెలోకి పోకుండా, ఇంకా పెట్టెమీదనే కూర్చున్న చక్రిలాగులూ—వాడు మనసుపడి కొత్తగా కుట్టించుకొన్న కోటూ, ఆ దొరటోపీ—చిన్నప్పుడు వాడు ఆడుకున్న రైలుబండి,తిరణాలలో వాడు కొనుక్కొన్న బుల్లి బూట్సులూ—అన్నీ మూలుగుతూ కూర్చున్నాయ్. దీపావళి సామానంతా రోజూ కొద్దికొద్దిగా కాల్చుకుందామని వాడు భద్రంగా దాచుకున్న తాటిఆకులబుట్ట తనను ఎవరూ చూడటం లేదని కాబోలు—తొంగితొంగి చూస్తోంది.

కిటికీ అనుకొని దొడ్లోకి చూస్తూ రామదాసు వివిధ విషయాల్ని తలంపుకు తెచ్చుకో సాగాడు. ఈనాటి నాయింత్రంపరకూ ఇంట్లోనేవున్న చక్రి ఉన్నట్టుండి మాయమైనాడు: వాడు భోంచేసే ఆ చిన్న వెండిపళ్ళెమూ, వాడి పంచరంగుల సూటుకేసూ ఇంక తుప్పుపట్టవలసిందే!

కటికి చీల్చుకొని లాంతరు వెలుగుదొడ్లో వాల్తోంది. చక్రి నాటిన తులసివనం పరిమళాన్ని పంపుతోంది; వాడు నాటిన కాకరపాదు గుబురుగా పెరిగింది. దేవుడి పూజకు

గాను—ఊరంతా తిరిగి తెచ్చి నీళ్ళుపోసి పెంచిన—చంద్ర కాంతలూ, సూర్యకాంతలూ, ఎర్రగన్నేర్లూ— తలలు వాల్చి కూర్చున్నాయ్. కన్నార్పకుండా ఆ దొడ్లోకి చూస్తూన్న రామదాసుకు కాకరపాదు సమీపంలో ఒక వ్యక్తి మసులుతూన్నట్టనిపించింది.

రామదాసు అనుకున్నాడు—చక్రి తనవనాన్నీ, గదినీ పుస్తకాల్నీ చూసుకునేందుకు వచ్చాడని...వాడేనా? వాడి ఎత్తునే...వాడిలాగు నడుస్తూనే తిరుగులాడుతున్నాడు...ఆ ఎండుటాకుల మీద నడుస్తూన్న శబ్దమూ అదీ ?

చచ్చినవాళ్ళు ఎప్పుడైనా, ఎందుకైనా బతికి వొస్తారా? తను భ్రమిస్తున్నానేమోనని కళ్ళునులుచుకొని చూశాడు; ఇంకా ఆ వ్యక్తి అక్కడే నిలబడ్డట్టుంది.

శూన్యంలోకి చూస్తూ మెల్లిగా అన్నాడు—"చక్రీ... చక్రీ...నా కోసం. అమ్మకోసం ... మళ్ళీ వొచ్చావా నాయనా? ఆగు బాబూ — వొస్తున్నా — ఆ చీకట్లో, చలిలో, కాళ్ళకేమీ లేకుండా— నడవబోక బాబూ— చక్రీ...చక్రీ...వెళ్ళబోక......ఇదిగో—లాంతరు తీసుకు వొస్తున్నా—

లాంతరు పుచ్చుకొని గబగబా దొడ్లోకి పరుగెత్తాడు. అంతటా పరికించి చూశాడు; ఎవ్వరూ లేరు—కాకర పాదు మీద ఆరేసిన చక్రి లాగూచొక్కాలు తప్ప. అవ్వి తీసి భుజానవేసుకొని, "చచ్చికూడా నన్ను మోసంచేసి పడిపిస్తు

న్నాడు—'' అనుకొని నిట్టూర్చి నిస్పృహతో మళ్ళీ గది లోకివొచ్చి ఆ శూన్యంలోకి, అనంత వివిక్తాంతరాకాశంలోకి, చీకటి సముద్రంలోకి—చూస్తూ నిలబడ్డాడు—ఇంకా చక్రి వస్తాడనే ఆశతోనేమో!

అట్లా ఎంతసేపు శిలాప్రతిమలాగు నిలబడ్డాడో కాని—దొడ్లో మరో మూలనుంచి వేదనతో ఏదో చెప్పరాని బాధతో ఆవూ లేగదూడా కంఠాల్ని కలిపి 'బాంబా!' అని అరిచేదాకా—రామదాసు ఆ ఇంట్లో వ్యక్తి అవి లేక పోయ్యాడు. వెంటనే లాంతరు తీసుకుని వాటిని సమీపించాడు; రామదాసును చూడగానే అవి తోకలెత్తి నోరు తెరిచి, కటిక నేలను కాలితో రాయసాగాయి. రామదాసు, పాపం! ఎంతసేపు ఇవి ఇల్లా బాధపడుతున్నాయో? దుఃఖంవల్ల వాటికూడా పీకలార్చుకు పోయ్యాయి కాబోలు—'' అనుకొని వాటికి నీళ్ళుపెట్టి గడ్డివేశాడు. దూడ గడ్డిని ముట్టక, తలవాల్చి మూరెడు పొడుగు నాలికతో రామదాసు చేతిని నాక మొదలుపెట్టింది. ఆ దూడ పుట్టంగానే, ''అమ్మా ఇది నాకు—నాన్నా! ఈ దూడ నాది'' అని చక్రి దాంతో ఆడుకో మొదలు పెట్టిన ఘట్టం జ్ఞాపకమొచ్చి, దూడ మెడను చేతుల్లో బంధించి దీనంగా దాని కళ్ళల్లోకి చూశాడు. చక్రి తన మెడలో కట్టిన మువ్వలు గలగల్లాడేట్టు అది తల ఆడించి, ఎంతకూ తన యజమాని రాడని కాబోలు—కళ్ళు రెండూ నీళ్ళతో

...ంపింది! ఆవుకూడా దూడ మెడమీదినుంచి తలమోపి—రామదాసు చేతిని కొమ్ములతో రుద్ద సాగింది. రామదాసు మెల్లిగా అన్నాడు: "మీకూడా తెలుసా—చక్రి ఇంక రాడని? మీకు మేత వేసేవాడూ, సమయానికి నీళ్ళు పెట్టే వాడూ, ...తో మాట్లాడటం తెలిసినవాడూ, మీ ...కు తానవశాల్ని తగిలించి మీతో ...డే ...ోకంగా చూస... నే మానవ స్నేహితుడు పోయ్యాడని దుఃఖిస్తున్నారా? ... చక్రి ...కు మేత వెయ్యకుండా అన్నం తినేవాడు. ...—వాడు—ఇంక రాడమ్మా—రాడు ఎందుకు ఏడు స్తారు?" అవి రెండూ ఆ మాటలు అర్థమైనట్టు—సాను భూతిగా తలలు ఆడించి, వాల్చి నేలను కాలితో రాస్తూ అమిత ఆవేదనతో 'అంబా!' అని అరిచాయ్! ఆవు దీనంగా జాలిగా బాధగా చూస్తూ ముక్కు రంధ్రాల్ని పెద్దవిగాచేసి, నిట్టూరుస్తున్నట్టు వేడి గాడ్పుల్ని పైటికి పంప నారంది. నేలమీదవున్న ఆహారంతో తనకు నిమిత్తం లేనట్టు— గడ్డినీ జనపకట్టెనూకూడా కాలితో అవతలికి నెట్టేసింది. కొన్ని నిమిషాలపాటు ఆ మూగ జంతువుల ముందు నిలబడి వాటితోపాటే కన్నీరు కార్చి—వాటిని తట్టి—రామదాసు ఎల్లాగో ఇంట్లోకి వొచ్చాడు. చక్రి ఇంకా ఎక్కడైనా వున్నాడేమోననే ఆశతో కాలుకాలిన పిల్లిలాగు ఇల్లంతా దేవులాడాడు కాని—ఎక్కడవున్నాడో ఏ దివ్య జ్యోతిలో లీనమైనాడో—ఎవరికి తెలుసు?

హరి కలత నిద్రలో ఉలిక్కిపడి లేచి...రామదాసు ఆ అర్ధరాత్రి ఎంతవరకో ఇంకా తిరుగులాడుతూవుండటాన్ని చూచి కొంచెం ఆశ్చర్యపడ్డాడు : లేచి కూర్చున్న తనను కూడా గమనించకుండా గదిలో ప్రవేశించిన రామదాసును చూర్చి కొంచెం ఆలోచించి చరచరా గదిలోకి జొరబడి "కక్కా ; మరీ పిచ్చివాడివై పోతున్నావ్ ! ఇంతదుఃఖిస్తే నీ ఆరోగ్యానిక్కూడా ముప్పు వొస్తుంది సుమా :" అన్నాడు.

రామదాసు గట్టిగా ఊపిరిపీల్చి, కనుకొలకుల్లోని నీటిని గోటితో మీటుతూ అన్నాడు—"నాకు తెలుసు హరీ— ఇంకా యీ ముసలి శరీరంలో మిగిలివున్న కండలూ, రక్తమూ, చీమూ, శక్తికలిసి యీ కన్నీటి రూపంలో బైటపడుతోందని, నాలో ఇంకా కొద్దికొద్ది మోతాదుల్లో మిగిలివున్న ప్రతి శక్తినీ, ప్రతి అణువునూ వాడు లాక్కుపోయి—యీ చర్మపు తిత్తిని మాత్రమే వదిలివెళ్ళాడు ! జీవితకాలమంతా జీవనదివలె ప్రవహించటానికి యీకళ్ళింకా గుడ్డికాకుండా వున్నాయేమో ! విషాద బాష్పాలకు తప్ప— —ఆనంద బాష్పాలకు నోచుకోని యీ నేత్రాలెంత పాపం చేశాయో ! హృదయంలో వాడు చేసిన యీ కనపడని గాయం ఎప్పటికైనా మానుముఖం పడుతుందనే నమ్మకం నాకు లేదు బాబూ" అయిపోయింది—కళ్ళకింక నీటిని కార్చేశక్తి ! నా చక్రిని బతికించుకోలేక పోయ్యాననే తీరని

సమస్యల్లో, అంతు ఆవేదనతో ఇంకెంతకాలం తపించి, కృంగి, కృశించి నశించాలో నాకే అగమ్య గోచరంగా వుంది—హరీ...

హరి నిట్టూర్చి అన్నాడు; "నీకు తెలీదా "కన్నా—" లోకమంతా ఏకమైనా మృత్యుముఖంలోని వ్యక్తిని వైద్యశక్తి లాగ లేదని? వైద్యులంటే——రంగునీళ్ళు పోసి కళ్ళనీళ్ళు తుడిచేవాళ్ళే కాని—ప్రాణంపోసేశక్తి వాళ్ళకు లేదని?"

తలతిప్పి, "ఈ దుఃఖానికి హృదయం పగిలేట్టుంది నాయనా! మేంకార్చిన కన్నీటిని కొల్చేపాత్ర వుందా బాబూ! మా వేడి నిట్టూర్పులతో గాలిదేవుడు చలికాచుకున్నాడు; మా కన్నీటికాల్వల్లో భూదేవి జలకమాడింది. ఈ ఏకపుత్ర భిక్షకోసం భగవంతుణ్ణి ఎంత జాలిగా ప్రార్థించాము? వేడి కంటనీరు పెడితే—వేటగాడికి; చాలా నిర్దయగా, నిర్లక్ష్యంగా, క్రూరంగా వాణ్ణి చంపి పారేశాడు! ఇంతగా దుఃఖింప జేసేవాడు—మాకు మానవహృదయాలెందుకివ్వాలి? కరగని, అరగని ఉక్కు హృదయాలివ్వరాదా? భగవంతుడు? ఉన్నాడా హరీ? ఉండి నన్ను పరీక్షిస్తున్నాడా! అంతులేదా—యీ విషమపరీక్షకు? నేనేం తప్పుచేశాను? ఏ నేరాన్ని నామీద ఆరోపించాడు ఆ మొండి జగన్నాథుడికి, శిలాస్వరూపుడికి కంచుకాగడాలు వేసి వెతికినా—జాలి, దయా—వున్నయ్యా? ఇంత పాపమా నా పూర్వజన్మలోది? ఒద్దు హరీ— ఇలాంటి

భరించి, సహించలేని కఠినశిక్ష—నా గర్భశోకప్పుడే నా నొద్దు—'' అని అని ఉద్రేకంతో చెప్పి, కళ్ళురెండూ మూసుకొని అరచేతుల్తో ముఖాన్ని కప్పుకున్నాడు.

హారికికూడా కంటనీరొచ్చింది ; కాని ఎల్లాగో ఆపుకొని పక్కనే పడివున్న సైన్సు పుస్తకాన్ని తీసి ఆ బొమ్మల్ని చూపుతూ చెప్పాడు ; '' చూడు కన్నా! మనం ఎవర్ని ప్రేమిస్తున్నాం ? ఈ బొక్కబొక్కలుగా వున్న పుర్రెల్నీ, ఈ అస్థిపంజరాల్నీ, యీ ఎముకల పోవుల్నీని! వీటిని కప్పేందుకు రంగు చర్మమూ, ఈ యంత్రాన్ని నడిపేందుకు ప్రాణంవుంటేనే కాని మానవుడవడే! ప్రేమించగలమూ—యీ వికృతరూపాల్ని ? నీకు తెలీదా కన్నా ? యాభై ఏళ్ళ జీవితాన్ని చూశావు—నేను చెప్పాలా ? లోకంలో పుత్రుల్లేని వాళ్ళు ఎంతమంది లేరు ? అందులో నువ్వొకడివి ; పుట్టిన పుత్రులు ఎందుకూ కొరగాకుండా పోతున్నారేనని ఏడ్చే వాళ్ళెంతమంది లేరు ! పుట్టినవాళ్ళను పోగొట్టుకొన్నవాళ్లెంత మంది లేరు ! చూడు కన్నా ! పుట్టేదాకా ఏడుపూ పుట్టాక ఒక ఏడుపూ ! గిట్టాక మరో ఏడుపూను ! పురుషుడివి—నువ్వే ఇంతగా దుఃఖిస్తే—పిన్ని గతేం కావాలనుకుంటున్నావ్ ? కన్నతల్లి—తండ్రికన్న బిడ్డల్ని ఎక్కువగా ప్రేమిస్తుందన్న సంగతి నీకు తెలీదా ? ప్రయత్నించాలి కన్నీటిని, కనుకొనల్నుంచి బైటికి రాకుండా చేసేందుకు. మరిచిపోవాలి—అంతాను—''

కొన్ని గంటలక్రితమే జరిగిన యీ విషాదాంత నాటికను ఎల్లా మరిచిపోను హరీ! ఇది మానవమాత్రుడికి సాధ్యమా—బాబూ? శరీరపటుత్వం నా నాటికి క్షీణిస్తూన్నా—వాడి కోసం ఎంతచేశాను? శక్తిలేకపోయినా రెండు ట్యూషన్లు పెట్టుకొన్నాను—వాడికోసమే హరీ! అది దానికడియాల్ని పెడగొట్టించి—మరికొంత డబ్బేసి— ఆ కంచాన్ని చేయించింది! ఈ పేదరిక భారంలోనే వాడికి 'తీరని కోరిక'ంటూ లేకుండా చేశాము! అప్పుడెంత గారాబంగా పెంచానో—ఇప్పుడంత దుఃఖించాల్సొచ్చింది! యాభై ఏళ్ళుగా నన్ను రక్షించిన దేవుడు... యీ నాటికికూడా నన్ను భక్షించ లేదు కాని—పదేళ్ళపాటే వాణ్ని రక్షించి, తన బాధ్యతంతా తీరినట్టు—యజ్ఞపశువులాగు వెంటపెట్టుకు వెళ్ళాడు! వాణ్ని గూర్చి నేనెన్ని కలల్ని కన్నాను—హరీ! ఊహా ప్రపంచంలో వాణ్ని ఎంత గొప్పవాడుగా చూచుకున్నాను. పెద్దవాడై యీ ముసలివాళ్ళను సంపాయించి పెడతాడను కున్నాను: మాకు ఇంకా ముందు మంచిరోజులున్నాయని ఆశపడ్డాను, ఆ ఆశలతోనే లేనిశక్తినీ, నూతనోత్సాహాన్ని కల్పించుకొని—ముందు వాడివల్ల రాణిద్దామనుకొన్నాను! కాని నా కలలనీ కూలిపోయ్యాయి; ఈ జీవితాంధకారంలో దూరాన మిణుకు మిణుకు మనే ఆ సన్నని దీపపు కాంతి కూడా అంధకారంలో కలిసి, కరిగిపోయింది! చక్రిలాంటి పుత్రుడు తమకు లేడని ఎంతమంది ఈర్ష్యపడేవాళ్ళు! నాకు

గర్భభంగం చేసి, ఇంటినొక స్మశాన వాటికగా మార్చి వాడి దారిని వాడు పోయ్యాడు—ఒక చేత్తో ఇచ్చినే ఆ దేవుడు వాణ్ని మరో చేత్తో ఖండించాడు! మమ్మల్ని చిత్రవధ చేసి, హింసింపజేస్తున్నాడు హరీ! మా చావును చూడవలసిన వాడు—వాడి చావుచే మేము యీ కళ్ళతో చూడవలసి వచ్చింది! వాడి పుట్టినరోజు పండుగను ఎంత గొప్పగా చేశాను! అది నా శక్తికి మించిందైనా నాకు కష్టమనిపించ లేదు బాబూ! హరీ—ఈలోకంలో వియోగాన్నైనా భరించవచ్చు కాని—ఈ శాశ్వత వియోగాన్ని భరించలేము బాబూ!''

హరి అన్నాడు; ''కక్కా చూడు. నేనే చక్రినీ, నేనే హరినీ అనుకో—వాడు నీకు ఏ ఆనందాన్నైతే ఇచ్చేవాడో—నేను దాన్నివ్వగలను! ఈలోకంలో మంచివాళ్ళకు తావులేదు? అందుకే వాడి ఋణంతీర్చుకోని వాడు జారుకున్నాడు. ఇంకా పన్నెండేళ్ళు గడిచాక—చక్రి—ఇల్లా తయారైనాడనుకో—కక్కా! ఉద్యోగంకూడా మానెయ్ నా దగ్గరుండు: మీ రెండుపొట్టల్ని పోషించే శక్తి నాకు వుంది! నేను బతికున్నన్నాళ్ళూ— చక్రిలేని కొరత తీరుస్తాను—''

రామదాసు ఒక విధమైన పిచ్చి సంతోషంతోనే ''నాయనా! హరీ—కాదు—చక్రీ—దేవుడిక్కూడా నీ మీద జాలిలేదు—ఇన్నాళ్ళూ యీ దేశంలో లేకపోయినా

నీ కెందుకయ్యా— ఈ ముసలివాళ్ళమీద ఇంత దయ ?"
అంటూ హారిని కావలించుకున్నాడు.

"నాకు సెలవిప్పించమని ప్రార్థిస్తున్నాను—"

ఉత్తరం చూసి ఇన్స్పెక్టర్ అన్నాడు! "సెలవు... సెలవు... ఇప్పుడు వీల్లేదు సార్. అనుకున్నాను మీ స్కూలు బాగా సాగుతోందని తీరా యిటొచ్చి చూస్తే మీ స్కూల్లో వున్న విద్యార్థులంత మొండి బండలు నాకు మరే స్కూల్లోనూ కన్పించరు—"

రామదాసు కంట తడిపెట్టి లోపల అనుకున్నాడు: "భగవంతుడా. ఇంకా నన్ని విషమ పరీక్షల్తో వదలవా? కొడుకుల్ని తీసుకుపొయ్యావ్—భార్యను లాక్కున్నావ్! నాది అనుకున్న ప్రతి వస్తువునూ పొట్టను పెట్టుకున్నా— నిండదా నీ అగాధమైన ఉదరగోళం? ఎందుకు నన్ని కారణం లేని శిక్షలతో ఇంకా చావబాదుతావ్?"

అమిత కోపంతో ఇన్స్పెక్టర్‌ను గూర్చి,

"నీకు పిల్లలు లేరా, భార్య లేదా ? వాళ్ళు మృతి పొందుతే నీకు మనశ్శాంతి వుంటుందా ? వాళ్ళ శాశ్వత వియోగాన్ని నీ హృదయం భరించగలదా ? అప్పుడు నువ్వు సెలవు కోరితే—నీపై అధికారులు నిరాకరిస్తే—నీ హృదయ వేదన ఎల్లా వుంటుంది ? మానవుడు—తోటిమానవుడికి సానుభూతి చూపలేడా" అనుకున్న మాటలు పెదవుల దాకా వొచ్చి, ఇన్స్పెక్టర్ తీక్షణ వీక్షణాలకు భయపడి—

చేతకాని బీదకోపమంతా అతి ఓర్పుతో గర్భగోళంలోని యథాస్థానానికి వెళ్ళిపోయింది.

కొంచెం ఆలోచించి, ఒక నిశ్చయానికివచ్చి, "నాకీ ఉద్యోగం వొద్దు— ఇప్పుడే రాజీనామా ఇస్తాను" అన్నాడు.

"స్కూలును పాడుచేశావ్ —ఇంక నీ ఇష్టం—" పెదిమలు బిగించి తీక్షణంగా చూశాడు ఇన్స్పెక్టరు సాబ్, ఆ చూపులకే అగ్నికున్న శక్తివుంటే—రామదాసు బుగ్గయ్యేవాడు!

"పాతికేళ్ళనుంచీ నాలోని ప్రతి రక్తకణాన్నీ యీ స్కూలుకు ధారపోశాను. ఇంతవరకూ ఎవరిచేతా మాట పడలేదు. భార్య పోయిననాడుకూడా స్కూలుకొచ్చి పని చేశాను—"

"ఎవరికోసం చేశావు? నీ పొట్టకోసం దేవుళ్ళాడావ్—"

"పోనీండి—బతికి చెడ్డవాణ్ని—నన్ను ఇంతటితో పోనీండి. ఇన్స్పెక్టరుగారూ! భగవంతుడికే నామీద దయ లేనప్పుడు—ఇతర మానవుల సానుభూతి ఉంటుందని నేనెప్పుడూ అనుకోను. ఈ నాటికి మీలాటి దయామయుల చేత మాటపడ్డాను! నా తప్పు లేమన్నా వుంటే—అధికార్లు—క్షమించండి—ఇదుగో రాజీనామా" అని స్తబ్ధుడై కూర్చున్న ఇన్స్పెక్టర్ ముందుకు రాజీనామా పత్రాన్ని తోసి ఆ స్కూలును తుదిసారి చూస్తూ, ఒక నమస్కారాన్ని అధికారికి సమర్పించుకొని, 'శెలవు—' అని బైట పడ్డాడు

బైట తిరుగులాడుతూన్న తన అసిస్టెంటు రామ్మూర్తిని ఇవతలికి పిలిచి రామదాసు అన్నాడు:

"మూర్తీ నాకు తెలుసు...నీకు చాలాకాలంనుంచీ యీ హేడ్ మాష్టరీ పదవిని అనుభవించాలనే ఉద్దేశం వుందని. దాని కోసం ఆ ఇన్స్‌పెక్టరుకు వంద రూపాయి లెందుకు తగ లేశావ్—బాబూ? నన్నడుగుతే—నేనీ ఉద్యోగం విడిచి పోనా? నా కెందుకీ సంపాదన? పిల్లలు గలవాడివి అనుభ విస్తావంటే—నాకు అక్కర్లేనిదాన్ని త్యాగం చెయ్యలే ననుకున్నావా? పోనీలే—అయిందేదో అయింది; కాని ఒక్కటి గమనించు బాబూ—నా ఉద్యోగంలోకి నువ్వొ చ్చినట్టే — నీ ఉద్యోగంలోకి మరోవాడొస్తాడనుకో— అప్పుడు కాని తెలీదు నీ బాధ్యత! ఎల్లాగైనా పదికాలాల పాటు పనిచేసి యీ స్కూలును వృద్ధిచెయ్ బాబూ—వెళ్ళి వొస్తా—" రామ్మూర్తి శిలా ప్రతిమలా నిలబడి, మాట్లా డేందుకు నోరువిప్పి—మాట్లాడలేక గుటకలు మింగుతూ మెల్లి మెల్లిగా వెళ్ళిపోతూన్న యీ అవతార మూర్తిని చూస్తూ నిలబడిపొయ్యాడు.

## 5

"హరి! ఉద్యోగం కాస్తా ఊడింది."

హరి అదిరిపడి, "అదేం?" అన్నాడు.

జరిగిందంతా రామదాసు నోటివెంట విన్నాక హారి "ఇంత అన్యాయమూ—అక్రమమూ జరుగుతూంటే— నేను ఊరుకోలేను కక్కా—రేపేవెళ్ళి బోర్డ్ ప్రెసిడెం టుతో మాట్లాడివొస్తా—" అన్నాడు.

"అక్కర్లేదు హారీ! అది నా చేతులారా చేసుకుం దేలే! పెళ్ళామూ, బిడ్డలూ! నా కెందుకీ ఉద్యోగం? ఒకర్ని క్షణి స్తేనే కాని, మరొకరు రాణించరు—పోనీ ఆ రామ్మూ ర్తి నేతినవీలే! జీవితంలో అన్ని బాధ్యతలూ తీరిపోయినయ్. ఒక్కణ్నే ఏకాకిగా నిలబడి పోయ్యాను హారీ! మృత్యు దేవత మా కుటుంబంమీద చూపే యీ అపార దయను భరించలేను బాబూ! ఒక సామాన్య మానవ హృదయంలో ఇమడనంత విషాదాన్ని నాపై మోపాడు. అదికూడా బతికి వున్నట్టయితే ఒకరి కొకరం ఎదురుగా కూర్చొని ఏడ్చేవా ళ్ళం. అదీ ఒకందుకు మంచిదే అయిందిలే! యాభై ఏళ్ళ జీవితం గడిచిపోయింది; ఇందులో నేను సాధించిం దేమీ లేదు. అంతా స్వప్నంలాగు సాగిపోతోంది; నేను సంతోష పెట్టాల్సిన వ్యక్తి లేనేలేడు! నాకు నేనై ఒంటరిగా యీ సముద్ర మధ్యంలో నిలబడిపొయ్యా—ఆ మృత్యుదేవతకు నేను తప్ప — మిగతా కుటుంబీకులందరూ కన్పించారు కాబోలు! నా జీవితానికి 'శాంతి' వుంటే దాన్ని ఒక్క మృత్యుముఖంలోనే అనుభవించగల నేమో! ఇం కెందుకీ ఇన్సూరెన్స్ పాలసీ—"అని దాన్ని చింపి కాళ్ళతో నేల నేసి రాశాడు.

సందె చీకట్లు క్రమ్ముకుంటున్నాయి. హరి, రామదాసు పాదాలదగ్గర కూర్చొని ఏమో దీర్ఘంగా ఆలోచించి అన్నాడు—"కక్కా! నేను చెప్పలేదా—ఇంట్లో కూర్చొని తినమని, నీ శక్తికిమించని పన్ని నువెందుకు చేస్తావ్?"

నవ్వి రామదాసు, "నీకెందుకయ్యా—ఇంత దయ, దేవుడే నా జీవితాన్ని నిర్దయగా, నిర్లక్ష్యంగా నలిపి పారేశాడు! ఈ లోకభారానికీ, దుఃఖానికీ కృంగి కృశించి పోయి———ఎవ్వరికీ ఎందుకూ కొరగాని యీ బీదవాడి కోసం—ఎందుకయ్యా—అతి విలువైన సానుభూతి కన్నీటిని వృధాచేసుకుంటావ్?" అన్నాడు.

హరి కక్క పాదాల్ని తాకుతూ, కక్కా నేనేం చెప్పాను? నేనే చక్రిని కానూ? అప్పుడే మరిచిపోయ్యావా—నన్ను?" అన్నాడు.

రామదాసు లోపల హరిని దీవిస్తూ అన్నాడు: "సరే నాయనా! కాదన్నానా? చూడు బాబూ! ముసలివాన్నయి పోయ్యాను. శరీరంలోని కండలు ఒక్కొక్కటిగా కరిగి పోతున్నై. రోజు రోజుకూ క్షీణించే శక్తితో చర్మం ముడతలు పడి పోతుంది. చూపుకూడా సరిగ్గా ఆనటం లేదు—నాకు ఇంక జీవితంలో ఒక్కటే కోరిక వుంది: రామేశ్వరమూ, కాశీ చూద్దామని వుంది. ఆ కాశీలో విశ్వనాథుడి ముందు. పవిత్రగంగా జలపానంలో—శాంతి దొరుకుతుందేమో! నేను పూర్వజన్మలో ఏ సత్కార్యాన్నైనా చేసి

వుంటే—ఆ శంకరుడికి నామీద ఏకొద్ది దయైనా వుంటే—ఆ త్రిశూలంతో నన్ను పొడిచి పడరానిపాట్లనుంచీ, భరించ లేని బాధలనుంచీ విముక్తి చెయ్యమని ప్రార్థిస్తా, కాశీలో అందరూ తమకు అత్యంత ప్రియమైనవాటిని వొదిలిపెడతారు. నేను నా ప్రాణాన్ని వదిలివేస్తా—బాబూ!"

హరి దిగులుతో, "కక్కా! వెళ్ళిపోతావా? నన్ను విడిచి వెళ్ళిపోతావా?" అన్నాడు.

"ఇంక నేను ఎక్కువ దినాలు బతకనని నాకెవరో చెప్తున్నారు బాబూ! బద్ధలైన నా తపమంతా యీ జన్మతో తీరిపోతే అదే చాలు హరీ! విషాదపూరిత మానవ జన్మకన్నా—శాంతియుత జంతుజన్మే మంచిది—నీకెందుకయ్యా—యింత దుఃఖం—నా బాబూ?"

"తండ్రి పోతూంటే — కొడుక్కు సంతోషమా— కక్కా—"

"బాబూ—అనుకున్నాను—నేను చస్తే కంటతడిపెట్టే ప్రాణన్నా లేదని, ఇప్పటికి యీ విశాల విశ్వంలో నువ్వొక్కడివి మాత్రమే కన్పించావు. చాలు బాబూ—నీలాంటి వ్యక్తిని చూసి సగం మనోబాధను చంపుకోవచ్చు; మనవను కొన్నవి ఎన్ని పోవటంలేదు — హరీ! ఎంతమంది యీ లోకంలో దిక్కులేని చావు చావటంలేదు? అందులో నేనొక్కణ్ని. నా మీద నీకు దయ'వుంటే నన్ను పోనీ హరీ! ఈ ఒక్క 'ఆశ'నూ కూడా 'నిరాశ' చేసుకోనీ. నువ్వు కాదనకు హరీ!"

"పొయ్యేనాడిసి—నన్నుకూడా తీసుకుపో—కన్నా!"

"నువ్వా? పదికాలాలపాటు వర్ధిల్లి సౌఖ్యాన్ని అనుభవించు తండ్రీ! నోచుకోనివాళ్ళకు దుఃఖమే. అయినా—నోచుకున్న వాళ్ళకు యీ లోకంలో సౌఖ్యం లేకపోలేదు బాబూ—ఒద్దు హరీ! నువ్వెందుకు" అని మెల్లిగా హరి తలను నిమిరసాగాడు. ఇప్పటికి చెప్పలేని బాధతో వెలువడ్డ కన్నీటికాల్వ—రామదాసు పాదాల్ని కడిగేసింది.

"నాకు ఒక్క పని చేసిపెట్టు బాబూ—డబ్బు లేకపోతే—మనమొక భూభారమైపోతాం. ఆ యిల్లు అమ్మి ఆ వొచ్చిన డబ్బులో నాకు నెలకు ముప్పైరూపాయిల చొప్పున పంపుతూండు; నేను చనిపొయ్యాక ఇంకేమైనా మిగిలివుంటే నువ్వు తీసుకో బాబూ! ఆ ఆవూ, దూడా—యింకా నా లాగే బతికివున్నై. వాటిని కన్న బిడ్డల్లాగు పెంచాము బాబూ: వాటిని నిమిరే కమనీయ హస్తాలన్నీ ఒకొక్కటిగా మాయమౌతూన్నా గేపట్నుంచీ నీతులకు వాటిని పోషించే బాధ్యతను యియ్యి? వాటిని ఎవ్వరికీ యివ్వొద్దు; అమ్మొద్దు. ఒకవేళ అవి చస్తే— వాటిని మాలాళ్ళకు యివ్వొద్దు బాబూ! పుత్రుల్లాగే వాటినికూడా భూమాతకు పెంచుకునేందుకివ్వు: వాటి శవాల్ని పురుగులపాలూ, నక్కల పాలూ కాకుండా— భూస్థాపన చేయించు; ఆ గోమాత వనూ్నా పిన్నినీ, చక్రినీ కూడా పోషించింది. ఆ ఆవు—మొదటిసారి ధానికోడుకు పోయినప్పుడు మాలాళ్ళు దాన్ని

కాళ్లు కట్టుకులాక్కుపోతూంటే—కంటనీరు పెట్టి కొమ్ములు విసిరింది; రెండు రోజులదాకా నీరు తాగలేదు; గడ్డి కొరకలేదు. చక్రి పోయినప్పుడు కూడా—అల్లానే సానుభూతి చూపింది. చక్రి పుట్టక పూర్వం దూడగా వున్నప్పుడు తెచ్చుకున్న ఆవది. కొడుకు లాగేసాకాము. ఈ చేతుల్లోనే పెరిగి పెద్దదైంది. దాని ఇష్టం వొచ్చినట్టు తిరగనిచ్చాము. ఏ పొలంలోకి దూకక, ఎవరి పైర్లనూ నాశనం చెయ్యక, చెట్లచాటున వాలుతూ, గట్లమీది గడ్డినిమేసి—సూర్యాస్తమయ సమయానికి యిల్లుచేరేది. ఎవర్నీ ఎప్పుడూ పొడిచి ఎరగదు; ఆలస్యమైతే చక్రి పాలకు ఏడుస్తాడని—ముందుగానే వొచ్చేది. మమ్మల్ని కడుపులో పెట్టుకు కాపాడిన దానికి మాత్రం—యీ మాత్రం విశ్వాసం చూపటం నా విధి—యిది మరిచిపోవొద్దు బాబూ!

హరి వలవలా ఏడుస్తూ, "కక్కా! కక్కా! నీకీ మాటలు దయగలవేమో కాని—నా హృదయాన్ని చీలుస్తున్నై. నీకు డబ్బు కావలిస్తే నేను పంపకనా కక్కా! ఒక్క కడుపు నేగా నాన్నా నువ్వూ పుట్టింద—ఈ మాత్రపు సహాయం నేను చెయ్యలే ననుకున్నావా కక్కా! నా దగ్గర నాకు అనవసరమైనంతగా డబ్బు మూలుగుతోంది. నీకు నెలకు యాభై రూపాయలు పంపుతా కక్కా? పంపుతా కక్కా! వుండన్నావే! మరిచిపొయ్యావా కక్కా?" అన్నాడు.

రామదాసు తలత్రిప్పి, కళ్ళు మూసుకునే, హరి తలను స్పృశిస్తూ. "సరే బాబూ—నీ యిష్టం వొచ్చినట్టే కానీ—అన్నాడు.

మర్నాడు పాడుబడ్డ తన యింటిని చూసుకుంటూ రామదాసు అన్నాడు: "రెండు మాసాల క్రితం యిందులో ఒక కుటుంబం వుండేది; యిప్పుడిది సూర్యచంద్రులు నివ శించేందుకు తప్ప యింకెందుకూ పనికిరాని స్మశాన వాటిక లాగు తయారైంది."

హరిని దొడ్లోకి తీసుకుపోయి అన్నాడు: "పోషించేవాడు లేక చెట్లజీవితాలు కూడా వృథా అయిపోతున్నాయి. తమను చూచేవారల్లా లేరని తలలు వాల్చేశాయి; యింకెవ రికి కావాలి వాటి పూలు నాలాగే వాటి జీవితాలు కూడా ఎవరికీ క్కొరగాకుండా నశిస్తున్నాయి. రాతిబండమీద కూర్చుని హరి వేడినీళ్లు స్నానంచేస్తే—అవ్వి తాగి పెరి గింది—యీ కాకరగుబురు—యింకెవరు పోస్తారు దానికి నీరు?"

ఆవును చూపుతూ, "హరీ! యిదివరకే చెప్తాను దీన్ని గూర్చి—నేలేని కొరత తీర్చు బాబూ!" అన్నాడు.

రామదాసు మాటలు వాటికి అర్థమైనట్టు తలలు ఆడించి నేలను తంతూ "అంబా" అని అరిచాయ్. వాటిని నిము రుతూ అన్నాడు; 'ఫరవా లేదు—మీకు ఏకష్టమూ లేకుండా హరి మిమ్మల్ని చూస్తాడులే! మీలాగే నేనుకూడా ఏకాకినై

వున్నానుగా: మిమ్మల్ని పెంచి, నిమిరే కమనీయ హస్తాలు ఒక్కొక్కటిగా మాయమౌతున్నాయనా యీ విచారం? ఈ కుటుంబానికి తుది వ్యక్తిగా వెళ్ళిపోతున్నాననా? మానవ జీవితమే యింత కష్టభూయిష్ఠమైతే — యింక జంతు జీవితాల్ని గూర్చి ఏం చెప్పను! మళ్ళీ మిమ్మ చూడలేనమ్మా — యివ్వే కడసారి చూపులు" గోవుకు ప్రదక్షిణం చేసి మెల్లిగా యివతలికి వొచ్చాడు: వెనుకనే నిలబడి పోయిన జంతువులు మాటలు రాక — తమ హృదయభారాన్ని గొంతెత్తి పెద్దగా అరిచి చూపాయి.

•

కొంతమంది గ్రామస్థులూ, విద్యార్థులూకూడా మాస్టార్ని చూసేందుకు వొచ్చారు. అందరికీ నమస్కరిస్తూ రామదాసు అన్నాడు; 'మీ చలవవలన యిన్నాళ్లూ యిక్కడవున్నాను; మళ్ళీ మిమ్మల్నందర్నీ చూడగలనో — లేనో? ఈ గ్రామ మంతా సుఖంగా వుండటమే నాకు కావాల్సింది... నేను వెళ్ళిపోతున్నానని మీరు దిగులు పడొద్దు; యిప్పుడున్న మాస్టర్లు కూడా మంచివాళ్ళు. జాగ్రత్తగా చదువుకొని, వృద్ధిలోకిరాండి—"

ఒక్కొక్కరే బరువైన హృదయాలతో వెనక్కుమళ్ళారు.

వెంట వొస్తూన్న హరితో, "హరీ! చక్రిబట్టలూ— దాని బట్టలూ బీదవాళ్ళకు యిచ్చెయ్" హరి మౌనంతో తలవూయించాడు.

కొంతదూరందాకా ఎవ్వరూ మాట్లాడలేదు: కాని వారి హృదయాల్లో ఏదో ఆందోళన లేకపోలేదు.

“యాభై ఏళ్ళుగా పీల్చిన యీగాలిని వదిలి వెళ్ళటం నాకూ కష్టంగానే వుంది—హరీ! యింకెంతదూరం పోస్తావ్? యింటికివెళ్ళు బాబూ! ఈ చీకట్లో మళ్ళి యిదంతా వెనక్కి నడవొద్దా? కడసారి నిన్ను కావిలించు కోనీ హరీ!” అని హరిని కావిలించుకున్నాడు.

హరి కక్కపాదాల్ని పట్టుకొని, కక్కా! నిన్నక్క డెవరు చూస్తారు? యిప్పటికైనా మించి పోయిందేమీ లేదు—పద యింటికి వెళ్దాం—” అన్నాడు.

రామదాసు మెల్లగా నవ్వి, లోలోపల హరిని దీవిస్తూ, “అందర్నీ చూసే భగవంతుడే చూస్తాడు బాబూ! యింక నువ్వు ఆగు—” అని బండివాడితో, “తోలరా—బండి” అన్నాడు.

గణగణమనే గంటల చప్పుడుతో బండిసాగి చీకటిసము ద్రం లీనమైపోయింది. స్తబ్ధుడై క్షణక్షణానికీ క్షీణిస్తూన్న గంటలచప్పుడు వింటూ హరి వెనుక నిలబడిపోయి—కొన్ని నిమిషాలకు తెప్పరిల్లి గొంతంతా చించుకుంటూ, కక్కా— “కక్కా—కక్కా!” అన్నాడు—శూన్యంలోకి, ఒక్క ప్రకృతిమాత మాత్రమే హరికి సమాధాన మిచ్చింది.

# 6

ప్రజానికది చాలా అపూర్వ, విచిత్ర సంఘటనే! విధివిలాసం అనండి మరేమన్నా అనండి—కానీ అది రామదాసు జీవితంలో మాత్రం చెప్పలేని మార్పును మాత్రం తెచ్చింది.

ఆ మెడ్రాస్ అరవ గొడవలో తలవని తలంపుగా రామదాసు తెలుగుభాషలో పలకరించిన వ్యక్తి ఆనాడు బట్టల షాపులో ఎదురయ్యాడు.

"మీ దేవూరండీ?"

రామదాసు చెప్పాడు.

ఆవ్యక్తి నమస్కరించి, "మాస్టారూ! నన్ను మరిచిపోయ్యారా?" అన్నాడు.

ఎవరు? రామదాసు గడచిన జీవితాన్ని వెనక్కు తిరిగి చూసుకున్నాడు. తనదగ్గర చదువుకున్న అనేక ముఖాలు కన్పించాయి కాని—ఆ పాత పురాణంలో యీ వ్యక్తి మాత్రం తెలీటం లేదు.

తనకు తానై అతనన్నాడు: "నేను—వీరెంకయ్యగారబ్బాయిని—కృష్ణస్వామిని—"

రామదాసుకు బాగా గుర్తొచ్చి, "నువ్వా? స్వామీ యిన్నాళ్ళయినా నన్ను మరిచిపోలేదా?" అన్నాడు అదో విధమైన సంతోషంతో నవ్వుతూ.

ఏవేవో కుటుంబ విషయాల్ని గూర్చి మాట్లాడుకున్నారు. కాని, రామదాసు మాత్రం తన ప్రేమ పవిత్రాల్ని స్వామికి చెప్పక...తను రామేశ్వర ప్రయాణానికి వెళ్తున్నట్టు మాత్రం చెప్పాడు. కృష్ణస్వామి మెడ్రాస్‌లో యినుప కార్ఖానా పెట్టుకొని డబ్బు ఆర్జిస్తున్నట్టు రామదాసు తెలుసుకున్నాడు.

''మా యింటికి వెళ్దాం రాండి''— అని కృష్ణస్వామి రామదాసును బలవంతాన తన యింటికి తీసుకు వెళ్ళాడు.

ఎనిమిదేళ్ళ కుర్రవాడొకడు యింటి గుమ్మంలో ఎదురై, ''నాన్నా! నాకు పెన్ను తెచ్చావా?'' అన్నాడు.

కృష్ణస్వామి, ''రే—పు'' అన్నాడు.

కుర్రవాడు బిక్కమొగంతో దిక్కులు చూడసాగాడు.

కుర్రవాడు రామదాసు దృష్టినంతటిన్నీ ఒక్కసారి తన వైపు లాక్కున్నాడు. సరిగ్గా తన చక్రి పోలికే వాడిది. పోయిన చక్రి యిక్కడ జన్మించాడా? యిదెట్లా సాధనం? ఈ విశాల విశ్వంలో మనిషిని పోలిన మనుషులు ఎంతమంది లేరు? పోయిన విలువైన వస్తువు ఉన్నట్టుండి దొరుకుతే పొందేలాటి సంతోషంతో రామదాసు హృదయం నిండింది.

వెంటనే తన జేబులోవున్న కలాన్ని తీసియిస్తూ 'యిండు' అన్నాడు. కుర్రవాడు—ఆకలం ముసలిదనికూడా తెలుసుకోలేక—సంతోషంతో ఎగిరాడు.

కృష్ణస్వామి: 'తప్పు - అది వారిది - రేపు మనం తెచ్చుకుందాంగా - యిచ్చెయ్ -' అన్నాడు.

వాడు మాట్లాడకుండా ముఖం ముడిచి, కలంవున్న చేస బుల్లి చేతిని రామదాసు వైపు చాపాడు.

రామదాసు 'నవ్వుతూ, 'నాకింక దాంతో పని లేదులే బాబూ—నువ్వుంచుకో–'అన్నాడు.

"పోనీ రేపు కలంరాగానే ఆయనది ఆయన కిచ్చేస్తావా ?"

బుర్రవాడు 'సరే' నన్నట్లు తలవూపాడు.

పెదవి విరుస్తూ కృష్ణస్వామి, "చదువు లేదు కాని... కిలాలు కావాలి" అన్నాడు. వాడిదేమీ విన్పించుకోకుండా, "నాన్నా ఈయనెవరు ?" అన్నాడు.

కృష్ణస్వామికి ఏం చెప్పేందుకూ తోచక—బుర్ర గోక్కొని, "తాతయ్య" అన్నాడు : బహుశా రామదాసు ముసలిముఖాన్ని చూసి కృష్ణస్వామి యీ వరస బాగుందని తలిచాడేమో !

"తాతయ్య—ముసలితాతయ్య"అంటూ నవ్వి, రామదాసు చెయ్యపట్టుకొని—"తాతయ్యా—నా పుస్తకాలు చూస్తావ్ ?" అన్నాడు.

ఈ తాతా తామనుమల స్నేహం మాత్రం కృష్ణస్వామికి అర్థమవలేదు.

రామదాసు వాణ్ని దగ్గరకు లాక్కుంటూ "నీ పేరేమిటి ?" అన్నాడు.

"చ–క"

చక్రి! భగవంతుడు బలిగా తీసుకొన్నాడనుకొన్న చక్రి! మృత్యుముఖంలో పడి పోయాడనుకొన్న చక్రి! మళ్ళీ కొండనెక్కే పోరికాదు! తను ఎవరికోసం తపించి అంతులేని ఆందోళనకు గురవుతున్నాడో—వాడే యిక్కడ ప్రత్యక్షమయ్యాడు.

"చక్రీ—చక్రీ! నాకోసం యిక్కడున్నావా?" అని ఉద్రేకంతో లోపల అనుకొని వాణ్ని దగ్గరకు లాక్కున్నాడు.

ఆరాత్రి భోజనాలయ్యాక కృష్ణస్వామి అన్నాడు. "ఎంత మంది మాస్టర్లను పెట్టినా చక్రి చదవటంలేదు! మీరిక్కడుండి కొన్నాళ్ళపాటు వాడికి చదువుచెప్పరాదా?"

రామదాసుకు తెలుసు—తను యీచక్రిని విడిచి వెళ్ళ లేనని. తన జీవితాంధకారంలో యిప్పుడొక మెరుపు మెరిసినట్లుంది. తను చక్రితో గడిన పదేళ్ళూ జ్ఞాపకానికొచ్చాయ్; ఈ 'చక్రి' తన చక్రికన్న రెండేళ్ళు చిన్నయినా తన ప్రాణమంతా వాడిమీదికే పోసాగింది; శాంతి ఎరుగని అతని మనస్సుకు, ఈకుటీరంలో శాంతి వుండొచ్చని రామదాసు నమ్మాడు. తన పుత్రశోకాన్ని కొంత మరిచిపోవొచ్చు! అందులో కృష్ణస్వామి తనకు తానై అడిగాడు. రామదాసు అప్రయత్నంగానే "సరేలే" అని తలవూయించాడు.

* * *

ఉదయాన ఒకగంటా, సాయంత్రం ఒక గంటా—చక్రికి చదువుచెప్పటం తప్ప—మిగతా ఇరవైరెండుగంటలూ—

రామదాసుకు తీరికే! ఏ మాస్టరు దగ్గరా సరిగ్గా శ్రద్ధగా చదువుకోని చక్రి రామదాసు దగ్గరమాత్రం వినయంగా కూర్చొని చదువుకోసాగాడు; చక్రిని ఆజ్ఞాపించే పెళక్తి రామదాసు కళ్ళల్లో వుంది!

ఈ శుశ్రూష ప్రారంభమయ్యాక — చక్రిస్నేహాలు ముఖమే చూడటం మానేశాడు; కృష్ణస్వామి—కొడుకు గమనుకునాన్ని మాని ఎల్లాగో చదువులో పడ్డాడనే అభిప్రాయంతో వాణ్ని యేమీ అనేవాడు కాదు.

చదువు కాంగానే గురుశిష్యులిద్దరూ పెరట్లో పూల మొక్కల మధ్యవున్న నాపరాతి అరుగుమీదికి జేరేవారు. ఎవరూ చూడకుండా—రామదాసు చక్రిని ఎత్తుకునేవాడు; ముద్దుపెట్టుకునేవాడు; బజార్నుంచి వాడికి మిఠాయి తెచ్చి పెట్టేవాడు.

"తాతయ్యా! నీకు కథలు వొచ్చా?"

బోసి నోటితో నవ్వి రామదాసు తలవూపాడు.

"నాకో కథ చెప్పూ—"

రామదాసు చక్రికి అర్థమయ్యేకథ వెదికి. 'అనగా... అనగా...ఒక వూళ్ళో ఒకరాజు...'' అని మొదలుపెట్టాడు.

చక్రి ముఖంముడిచి, 'ఛీ......యీ కథను లక్షసార్లు విన్నా...నే చెప్పనా? ఆ రాజుకు ఏడుగురు కొడుకులు! ఏడుగురూ వేట్లోవడి—ఛీ—యిక వొద్దు—వెధవ రాజుల కథలొద్దు; మంచి కథ చెప్పూ' అన్నాడు.

రామదాసు తన కథనూ, తనలాంటి మహాత్ముల కథల్నీ చెప్పేవాడు, చక్రి మహా మంచి పిల్లవాడిలాగు అల్లరి చెయ్యకుండా వినేవాడు; ఆ కథల్ని చెప్పేందుకు తాతయ్యకూ, వినేందుకూ చక్రికీకూడా విసుగుండేది కాదు. తన యీడు స్నేహితులకన్నా యీ ముసలి స్నేహితుడు చక్రికి బాగా నచ్చాడు.

ఈ కథా కాలక్షేపంతో భోజనానికి పిలుపొచ్చేదాకా గురు శిష్యులిద్దరూ తోటలోనే పీఠంవేసేవారు. అదేం చిత్రమో కాని తాతా మనుమల స్నేహం దినదినాభివృద్ధిన జొచ్చింది. మనమడు తాతకొంగు పట్టుకు వేళ్ళాడేవాడు; వాడికి తాత గదిలో తప్ప నిద్రపట్టేది కాదు.

నెల తిరగంగానే కృష్ణస్వామి బలవంతాన పదిహేను రూపాయిల్ని మాస్టారికి జీతం కింద యిచ్చాడు.

ఆనాడు సాయంత్రం చక్రిని వెంట బెట్టుకొని బజారు వెళ్ళి—అనేక ఆటవస్తువుల్ని కొని—ఒక బండెడు సామానుతో యిల్లు జేరాడు. వాడు బూరాలు వూదుతూ యిల్లంతా నాట్యంచెయ్య మొదలెట్టాడు. తాతయ్య చేతకూడా ఆ హార్మోనీనీ, బూరాల్నీ వూదించేదాకా వాడికి తృప్తే లేదు. యిల్లంతా దద్దరిల్లే శబ్దంతో యిద్దరూ వాయిద్యాల్ని అమోఘంగా వాయించేశారు. పేక ముక్కల్తో యిద్దరు పనివాళ్ళూ మేడకట్టి గృహప్రవేశ మహోత్సవం దిగ్విజయంగా చేశారు.

చక్రి చాలరాత్రివరకూ ఆట వొస్తువుల్లోని జంతుజాలంతో సర్కస్ నడిపి—అలసి, సొలసి తాతయ్య కథను సగంవిని అల్లాగేపడి నిద్రపొయ్యాడు. చక్రి 'ఊ' కొట్టకపోవటం చూసి—ఆ విశాల విశ్వంలో ఎవ్వరికీ పనికిరాని తనతో యిన్ని ఆటలూ ఆడి నిద్రాదేవి కౌగిట్లో ఒరిగిన చక్రికి చలి గాలి తగలకుండా దుప్పటికప్పి—రామదాసు తన మంచాన్ని జేరుకున్నాడు. రామదాసు తను అనుకున్నంత నిర్భాగ్యుడు కాదనీ, యిక్కడ శాంతిదేవతతో సంధి కుదిరిందనే అభిప్రాయంలోపడి, వివిధ విషయాల్ని తలుస్తున్నాడు.

ఎంతకూ నిద్రరాకపోవటంవల్ల మెల్లిగా వరాండాలోకి వెళ్ళాడు: ఆ పక్కగదిలో కృష్ణస్వామీ అతని భార్యా మాట్లాడుకుంటున్నారు. వారి మాటల్లో 'మాస్టారు' అనే పదం విని తనను గూర్చే వారేదో అనుకుంటున్నారని మెల్లిగా వినసాగాడు.

“మీకు తెలీదు : నేను చెప్తే వినరు. చూడండి! వాణ్ణి ఎత్తుకు ఆడిస్తూండగా నేను చూశాను. యివ్వాళ వాణ్ణి బజారు తీసుకువెళ్ళి బండెడు సామాన్ను ఎగుమతి చేశారు. ఆ సామానుతో యివ్వాళ యింట్లో భూకంపం పుట్టినట్టు—యిద్దరూ కలిసి పెద్దగా నవ్వుతూ గంతులువేస్తూ చెవులు చిల్లులు పడేలాగు బూరాల్ని వూది వూది యింతకు ముందే పడుకున్నారు. లేని గారాబాన్ని మెడకు చుడుతూంటే—వాడికేం భయం వుంటుంది? యివ్వాళ ఆయనదగ్గర మరిగిన

చనువంతా—రేపు మనమీదా ప్రయోగిస్తాడు. మాష్ట రంటే భయం వుండాలి అదేం చనువు? నేను చెప్తున్నాను; వాడికి చదువురాకపోను—పాడైపోతున్నాడు కూడాను! తప్పుచేస్తే దబాయించలేనివాడు గురువెలా అవుతాడు?''

''కాదు లక్ష్మీ! ఆయనెల్లా చేస్తేనేమి? ఎవరిదగ్గరా చదవని చక్రి—ఆయనదగ్గర కిక్కురుమనకుండా పడివున్నాడు. ఆయనకు బాగా తెలుసు—ఆయన బాధ్యత, నేను ఆయన దగ్గర్నే చదువుకున్నాను—నాకు తెలీదా—ఆయన సామర్థ్యత? ముసలివాడు; పిల్లలు లేనివాడు—పిల్లలంటే జాలి చూపటం సహజమేగా!''

కోపంతో ఆమె అంది; 'మీయిష్టమైతే నెత్తిన ఎక్కించుకోండి! భోజనానికి తప్ప వాడు కన్పించడు. ఎప్పుడూ పనికిరాని కబుర్లు చెప్తూ వాణ్ని పూర్తిగా లోంగదీసుకున్నాడు. వాడి సామాన్లన్నీ ఆయన గదికే జేర్చుకున్నాడు. యిల్లా కొంతకాలం జరుగుతే చక్రి ఎందుకూ పనికిరాని సోమరిగా తయారౌతాడు!కొడుకు విషయంలో తల్లికూడా బాధ్యత వుందనే సంగతి మీకు తెలీదా?''

''నన్నేం చెయ్యమంటావ్?''

''చెప్పండి ఆయనతో——యింక యీ పైప్రేటు వొద్దని—''

''నాకది చాతకాదు—''

''పోనీ నేను చెప్తా—''

"ఒద్దు—లక్ష్మి!"

"ఒద్దకపోతే నాకీ సంసారంతోనే పనిలేదు. మీ యిష్ట మూ, వాడి యిష్టమూను. ఈ ప్రైవేటు వొచ్చాక వాడు స్కూలుకూడా పోవటం మానేశాడు. 'తాతయ్యా' 'తాతయ్యా' అనుకుంటూ ఆయన స్నానం చేస్తే తను చేసే, ఆయన మాంతే తనూమని...బాగానే వుంది! మొక్కై వొంగంది మానై వొంగుతుందా?"

మరి మాటలు విన్పించలేదు.

రామదాసు నిట్టూర్చి మెల్లిగా వెళ్ళి మంచంమీద వాలి దీర్ఘాలోచనలో పడ్డాడు. తన మూలాన-తనకు తెలీకుండానే చక్రి పాడైపోతున్నాడేమో! తల్లికి తెలీని బాధ్యత—పరాయివాడైన తనకు తెలీదేమో! అనవసరమైన గారాబం చూపుతే పిల్లలు పాడైపోరా—మరి? తన కృషి ఫలించక పోయినా— తను యీ దంపతులమధ్య కలహానికి కారణ మౌతున్నాడు! తను యింకా ముందు ముందు యీ కుటుం బానికి హానిచేస్తాడేమో! తను మంచి తలపెట్టినా దాని పరి ణామం చెడుగ్గానే మారుతోంది.

అనుకున్నాడు—"భగవంతుడా! నేనేం తప్పుచేశాను—యింతమంది దృష్టికి కంటకంగా వుండేందుకు? ఈ శాంతి మయ కుటీరాన్ని నా జీవిత పథంలో ఎందుకు సృష్టించావు? జాలరి ఎరను చూపి ఆశపెట్టినట్టు—కొంతవరకూ మరిచి పోయిన చక్రిని మళ్ళీ నాకెందుకు చూపావ్? నన్ను వెళ్ళ

గొట్టించేవాడివి—ఎందుకిక్కడ జేరనిచ్చావ్ ? నాలాంటి నిర్భాగ్యుల్ని యింకెన్నాళ్ళు భరిస్తుంది యీ భూమి ? భూమాతా !—ఒక్కసారి నీనోరు తెరిచి నన్ను నీలో యిముడ్చుకోతల్లీ ! ఒక్కసారి సముద్రాలన్నీ పొంగి నన్నొక్కణ్ణి యిముడ్చుకోరాదా ? ఆకాశం ఒక్కసారి విరిగి నా నెత్తినపడి—నన్ను పాతాళానికి పంపరాదా ?''

ఈ విధంగా తల్చుకుంటూ, తన జీవితంలో రాబోయే విషాద సంఘటనకు కన్నీరు కార్చుకుంటూ—రామదాసు దాదాపు ఆరాత్రంతా నిద్రాదేవిని దరిచేర నీయలేదు !

## 7

ఉదయాన అమ్మగారు పిలుస్తున్నట్టు విని—ఆమె ఎందుకు పిలిచిందో తెలిసిన రామదాసు నిర్విచారంగా దాసీని అనుసరించాడు. యిప్పటికి చక్రి యింకా లేవనే లేదు;

''మీరు వాణ్ని నెత్తినెక్కించుకుంటే లాభంలేదు. వాణ్ని భయపెట్టాలి. అనువిస్తే పిల్లలెప్పుడూ పైకిరారు—

''నేను కొట్టనూ లేను—భయపెట్టనూ లేను—తల్లీ ! యిన్నాళ్ళూ యజమానురాలు కుక్కమీదా, పిల్లిమీదా పెట్టి తనను ఎందుకు తిట్టేదో రామదాసుకు యిప్పుడు అర్థమౌతోంది.

"వాడు స్కూలుకూడా మాని మీతో ఆటల్లో పాటల్లో కలిసిపోతున్నాడు! మీరు చూడండి: రోజులో అనేక గంటలకాలం వాడు సోమరితనంలోనే గడుపుతున్నాడు: మీరందుకు అవకాశం యివ్వొద్దు—"

"నేను అతన్ని యేం అనలేనమ్మా! ఈరాత్రి బండికే నేను రామేశ్వరం వెళ్ళిపోతున్నాను. మీరింకో మాస్టర్ని కుదుర్చుకోండి. తెలిసో తెలియకో నేనేమైనా హానిచేసివుంటే క్షమించండి."

తన నోటిమీదుగా రావాల్సిన మాట-మాస్టారి నోటి వెంటనే వొచ్చినందుకు ఆమె సంతోషించింది; కాని దాన్ని మరుగుపరుస్తూ ఒకవిధమైన కోపంలో నేలను తన్ని—లేని కోపాన్ని దాసీదానిమీద చూపింది.

రామదాసు తలొంచుకొని నిట్టూర్చి బైట పడ్డాడు.

చక్రి లేస్తూనే బాకాను వూదుతూ ఆ ఉదయాన తాతయ్యకు వివాహ మహోత్సవాన్ని నిర్విఘ్నంగా చేసేశాడు.

ఈరాత్రే చక్రిని వీడిపోవాలనే మాట జ్ఞాపకాని కొచ్చినప్పుడల్లా రామదాసు కలవర పడసాగాడు.

తోటలో కూర్చుని మనమడి వాయిద్య ప్రతిభను పరీక్షిస్తున్నాడన్న మాటే కాని—రామదాసు మనస్సు మనసులోనే లేదు. అతి పరాకుగా చక్రి అడిగే కుంటి, గుడ్డి ప్రశ్నలుకూడా—రామదాసు చెవిలో జొరబడటంలా.

"తాతయ్యా! యివ్వాళ—అల్లా వున్నావేం? ఒక్కసారిగా ఉలిక్కిపడి, తనస్థితిని చక్రి గ్రహించాడేమోనని—

లేని నవ్వుముఖం పెడుతూ. "ఏం బాగానే వున్నానే." అన్నాడు.

నన్ను ఎత్తుకోలేవేం?"

ఓ నిర్ధమైన సంతోషంతో ఎత్తుకొని హృదయంలో యిముడ్చుకొని పొంగి పొరలి వొచ్చేదుఃఖంతో! అప్రయత్నంగా అన్నాడు. "రేపట్నుంచీ నిన్నెవరెత్తుకుంటారు బాబూ"

చక్రి నవ్వుతూ, 'ఏం? నువ్వో" అన్నాడు.

రామదాసు వికటంగా నవ్వి" 'నేనా? నేనా నేను రాత్రికి వెళ్ళిపోతా చక్రీ?" అన్నాడు.

"ఎక్కడికి? యింక చాల్లే దింపు—వాణ్ని దింపుతూ, "రామేశ్వరం—" అన్నాడు.

"అక్కడ ఏముంటుంది—తాతయ్యా?"

"దేవుడుంటాడు–బాబూ"

"చదువుకునే స్కూలూ అదీ వుంటుందా?"

"ఉహు" అని రామదాసు తల అడ్డంగా తిప్పాడు.

"తాతయ్యా! అయితే నన్నుకూడా తీసుకువెళ్ళు అక్కడ ఆడుకునేందుకు మంచి పిల్లలుంటారు కాదూ?"

"ఉండరు బాబూ—నువ్వొస్తావా? ఒద్దు బాబూ—ఒద్దు"

"పోనీలే ఎవరూ లేకపోతే—మనిద్దరమూ వున్నాంగా యిద్దరూ కథల్ని చెప్పుకుందాం—"

"మీవాళ్ళు పంపరు బాబూ—"

"అమ్మను అడుగుతాను—"

కుర్రవాడి ఆతృత చూసి, "ఒద్దు బాబూ—ఒద్దు—" అన్నాడు.

వాడు ముఖం ముడిచి, "మళ్ళీ నువ్వెప్పుడొస్తావ్ తాతయ్యా?" అని అడిగాడు.

"యింకెప్పుడూ రాను—"

"నేనూ రానా—నీకోసే వుంటా తాతయ్యా! అల్లరి చెయ్యనుగా—"

ఏ సమాధానం చెప్పటంచేతకాక, వాణ్ని ఎత్తుకు ముద్దాడి "సరేరా బాబూ" అన్నాడు.

"తాతయ్యా నన్నెప్పుడూ ముద్దపెట్టుకుంటావ్ దేనికి?"

"ముద్దొస్తూంటావు బాబూ!"

"ఎందుకని?"

"నాక్కూడా నీలాటి కొడుకుండేవాడు నాయనా!"

"యిప్పుడెక్కడున్నాడు?"

దుఃఖాన్ని అణచుకుంటూ రామదాసు, "చచ్చిపోయ్యాడు బాబూ!" అన్నాడు.

వాడికేమీ అర్థంకాక, "అంటే ఏంటి—తాతయ్యా?" అన్నాడు.

కుర్రవాడికి తెలిసే పదజాలాన్ని వెతుక్కొంటూ, రెండు చేతులూ పైకెత్తి ఆకాశంలోకిచూస్తూ, "అంటే... అక్కడ...ఆకాశంలో వున్నాడు బాబూ!" అన్నాడూ.

కుర్రవాడు ఆశ్చర్యాల్ని చూపుతూ, "తాతయ్యా! అక్కడికెల్లా ఎగిరాడు?" అని అడిగాడు.

"ఎగరదు బాబూ! దేవుడొచ్చి తీసుకు పోతాడు."

"దేనికి?"

"చచ్చిపోయ్యాక యిక్కడ వుండకూడదు—"

వాడికది అర్థమైందో లేదో కాని—ఒక విధాన తల తిప్పి అన్నా! "తాతయ్యా! మా అబ్బాయ్ మంచి వాడేనా?"

"ఆ. నీమాదిరిగానే వుండేవాడు."

"నాతో ఆడుకుంటాడూ? వాడికి చెట్లెక్కటంవొచ్చా? తాతయ్యా! వాడి పేరేంటి?"

"చ—క్రి—"

వాడు నవ్వుతూ తప్పట్లుకొట్టి. "చక్రి! నా పేరేనా" వాడు నాకన్న పెద్దవాడా—తాతయ్యా?" అన్నాడు.

"అవును నాయనా!"

"అయితే వాడు పెద్దచక్రీ—నేను చిన్నచక్రి నేను—కాదు తాతయ్యా?"

"ఊ"

"తాతయ్యా! మనంకూడా ఆకాశంలోకి వెళ్ళిపోదాం? నేనూ మా అబ్బాయీ కలిసి ఆడుకుంటాం—నేను వాడితో పోట్లాడను తాతయ్యా—నువ్వేం—యిద్దరికీ కథలు చెప్తువ గాని—"

రామదాసు వాడి అమాయకత్వానికి నవ్వుకొని, మెల్లిగా అన్నాడు: "ఎట్లా వెళ్దాం?"

"మీ అబ్బాయి ఎట్లా వెళ్ళాడు?"

"చచ్చిపోయి—"

"అయితే మనంకూడా చచ్చిపోయి వెళ్దాం—"

వాడికీ తనకూ అర్థమయ్యే భాష యీ ప్రపంచంలో లేదని రామదాసు "సరేలే!" అన్నాడు.

"ఎప్పుడు చచ్చిపోదాం?"

'అంత తేలిగ్గా చావొస్తే యింత కష్టముంటుందా?' అని లోపల అనుకొని "అట్లా అనకూడదు బాబూ!" అన్నాడు.

చక్రి బిక్కమొగంవేసి, "ఏం?" అని ఎదురు ప్రశ్న వేశాడు.

"తప్పు—పాపం"

మీ అబ్బాయి ఎట్లా చచ్చిపోయ్యాడు? వాడికి పాపం కాదూ? తాతయ్యా నాకు తెలుసు—పాపం లేదు. మనం కూడా వెళ్ళిపోదాం తాతయ్యా—"

రామదాసుకు వివిధ విషయాలు జ్ఞాపకానికొచ్చి కళ్ళు రెండూ నీళ్ళతో నిండాయి. చక్రి తాతయ్యను యీస్థితిలో యిదివరకెప్పుడూ చూడలేదు.

"తాతయ్యా—ఏడుస్తున్నావేం?"

'నా బ్రతుకే యింత బాబూ' అని లోపల అనుకొని, "కంట్లో నలకబడ్డది చక్రీ!" అని బొంకాడు.

"ఊదనా? నాకు మంత్రమొచ్చు తాతయ్యా! అమ్మకు వేశాను. నీకూ కూడా వేస్తానుండు" అని గుప్పెడు గడ్డిపరకలు తీసుకొని, వాడి భాషలో ఏదో మంత్రాన్ని జపించుకుంటూ— ఉఫ్—ఉఫ్! అని మంత్ర ప్రయోగం చేశాడు. ఆమంత్ర మహాత్మ్యంయేమో కాని— రామదాసు రెండునిమిషాల్లో— ఈ ప్రపంచంలోని మనిషివ గలిగాడు.

# 8

ఆపగలంతా చక్రి తాతయ్యతో ప్రయాణానికి సామాను సర్దుకో నారంభించాడు; కిందటి రోజుకొన్న అడివి మృగాల్ని వాయిద్యాల్నికూడా బుల్లిసూట్ కేసులో భద్రపరిచాడు— ఆ దేశ ప్రజలుకూ కూడా తన సర్కస్ కంపెనీని ప్రదర్శించి తీరాలనే ఉద్దేశంతో! పెట్టెకు పట్టుకున్నన్ని గుడ్డల్ని కుక్కాడు – అదో సరదాతో.

"ఏమిట్రా యిది?" అని తల్లి అడిగింది.

"తాతయ్యతో ఊరికి వెళ్తా—"

ఆమె ఆశ్చర్యపోయి, "ఏవూరు?" అంది. వాడికి సరిగ్గా జ్ఞాపకం రాక, "అదా? అదా...ఊరే!" అన్నాడు.

"రామేశ్వరమా?"

"ఆ. అక్కడికే!"

"ఏ ముందక్కడ? నువ్వెందుకు?"

''అబ్బ! అక్కడెక్కడే! ఆకాశంలోకే—'' అనగా యిదంతా అగమ్యగోచరంగా వుంది; వాడికి మతిచలించిందో తాతయ్యకు మతి చలించిందో ఆమెకు అర్థమవలేదు.

విమాన ప్రయాణమేమో ననుకొని, ''ఆకాశం లోకా! దేనికి?'' అంది.

'అక్కడే తాతయ్యగారి అబ్బాయీ — నేనూ ఆడుకుంటాం—'

'ఎట్లా వెళ్తారు?'

'ఎట్లాగా?' అని చేతులు తిప్పుతూ, కళ్ళు పెద్దవిచేసి నీకు తెలీదు—చచ్చిపోయి—వెళ్ళిపోతాం—నువ్వు కూడా వొస్తావా? నిన్ను తీసుకెళ్ళంలే—' అన్నాడు.

'ఛా! ఏమిటా మాటలు;'

ఆమె కళ్ళల్లోని కోపానికీ, ఆజ్ఞకూ చక్రి బిక్కమొగం వేశాడు.

ఆమె వెంటనే మాస్టార్ని పిలిపించి, 'బాగుంది మీపాఠం వాడికి చచ్చిపోమ్మనీ మీతో రమ్మనీ బోధించినట్టున్నారు'' అంది. మాస్టారికి ఏం చెప్పేందుకూ తోచక, ఎల్లాగో అన్నాడు; 'లేదమ్మా; నాతో ఎందుకు తీసుకు వెళ్తాను?'

చక్రి తల్లి కాళ్ళకు పెనవేసుకొని, 'నేను వెళ్తానే—అని మారాంచేయసాగాడు.

ఆమెకు కోపంవొచ్చి, చేతిగాజులు గల్లుమనేట్టు—కొట్టేందుకు చెయ్యెత్తింది.

చక్రీ యీ అపాయాన్ని గుర్తించి — వెంటనే తల్లిని వొదిలి బుసలుకొట్టుకుంటూ......... తాతయ్య చాటుకువొచ్చి— విజయ సూచనగా పెద్దగా శంకాను పూరించి, 'నేను వెస్తా— ఏం చేస్తావేంటి?' అని మొండి ధైర్యాన్ని చూపించాడు.

రామదాసుకు పరిస్థితి బాగా అర్థమై, 'కుర్రవాడివిషయం నేను చూస్తాను— మీరేం దిగులు పడక్కరలేదు —' అన్నాడు.

తనకొడుకు తనకే లొంగిపోవటంచూసి సిగ్గుతో రోషంతో ఎర్రబారిన ముఖంనుంచి వేడిగాలుల్ని విసురుతూ ఆమె నిష్క్రమించింది.

చక్రి, మాటమాటకూ ముళ్ళుతిరగని తన జపాను చేతి గడియారాన్ని చూస్తూ, తాతయ్యా! టైమైంది— వెళ్దాంపా—'అనసాగాడు.

'యిప్పుడు కాదు—రాత్రికి'

ఎట్లాగో తాతయ్యమాటను తోసెయ్యక చక్రి అమిత ఓపికతో సూర్యాస్తమయందాకా చూశాడు.

రాత్రి భోజనాలయ్యాక —యథాప్రకారంగా గురుశిష్యు లిద్దరూ గదిలో చేరారు; ఈ రాత్రి బండికే రామదాసు తన ప్రయాణాన్ని నిశ్చయించుకొన్నాడు; కాని, చక్రి రోజూకన్న ఎక్కువగా యీనాడు తాతయ్య చెంగుపట్టుకు వేళ్ళాడుచూ, నిమిషనిమిషానికీ, 'వెళ్దాంపా— తాతయ్యా!' అనటం మొదలుపెట్టాడు.

ఈనాడు తాతయ్య చెప్పే ఏకథా వాడికి రుచించటం లేదు; వాడు ప్రయాణాన్ని గూర్చిన సమస్యతోనే తన బుల్లి బుర్రకు పని కల్పించాడు.

చక్రిని తనతో కూడా తీసుకుపోయి శిథిల మవంగా మిగిలిన జీవితాన్ని, శాంతంగా గడుపుదామనే ఊహ రామదాసులోకి జొరబడ్డది. కాని తన చేతుల్లో ఏ బిడ్డ సరిగ్గా బతికింది? అది తన హస్తాల చలవేనేమో! తన బిడ్డంటే మృత్యుదేవతను అమిత ఆదరమేమో! తన చక్రిని పోగొట్టుకొని—పరాయి చక్రిని తీసుకుపోయి చూస్తూ చూస్తూ చేతులారా మృత్యుదేవిముఖానికి అందివ్వేందుకు తన మనస్సెల్లాగు ఒప్పటంలేదు. స్వార్థానికై యీ చక్రిని ఎవరికీ తెలీకుండా ఎత్తుకుపోతే—వాడి తలిదండ్రులు దుఃఖించరా? తన ఏకైక చక్రి పోయినప్పుడు తనెంత క్రుంగి కృశించాడు! ఎవరిబిడ్డ వారి కంతేగా? ఛీ! యిది దొంగతనం! తనకింకెవరున్నారు? తనింకా ఎక్కువ కాలం జీవించే ఆశ తనకు లేదాయె! తనతో చక్రిని తీసుకుపోయి తన మరణానంతరం వాడి జీవితాన్ని పాడుచెయ్యటం దేనికి? మొదట్నుంచీ చక్రి తల్లి తనను అనుమానిస్తూనే వుందాయె! ఈ పరిస్థితుల్లో వాణ్ని వెంటపెట్టుకు వెళ్ళటం చేతులారా గొంతుకు ఉరితాటిని తగిలించుకోవటమే!

చివరకు, రామదాసు—చక్రికి తెలీకుండా రైలెక్కాలనే దృఢనిశ్చయానికొచ్చాడు.

బైట జోరుగా వాన కురుస్తోంది. చల్లగా హోరుగా గాలి వీస్తోంది.

'తాతయ్యా—నిద్రావా?' చక్రి యీ పాటను వదిలిపెట్టలేదు.

'యిప్పుడు బండిలేదు బాబూ! తెల్లవారుజామున—'

యింతవరకూ గురువాక్యాలమీద వాడికి విశ్వాసం ప్రగాఢ కాని—యీ తుది వాయిదానుమాత్రం వాడు నమ్మలేకపోయాడు. తాతయ్య తనను మోసం చేస్తున్నాడని వాడికెవరో చెప్తున్నట్టుంది.

'అబద్ధాలు—తాతయ్యా—నేను నిద్రపోయ్యాక నన్ను విడిచిపెట్టి వెళ్ళిపోతావా?'

యిదికూడా వాడు కనిపెట్టాడు. నిజమే! వాడికి తెలీకుండానే పారిపోవాలి! తప్పదు! లోకంలో ఎన్ని సంయోగ వియోగాలు కలగటం లేదూ? అందులో యిదొకటి! ఈ వేదాంతం తెలీని చక్రి తనకోసం కొన్నాళ్ళపాటు దుఃఖించినా—వాడి భావిజీవితం రాణిస్తుంది, తన ముసలి వాసనా, తన పాడుస్నేహమే వాణ్ణి పాడుచేస్తున్నాయేమో! ఎందుకో ఆ ముసలిప్రాణిమీద వాడికంత అపేక్ష? భగవంతుడే యీ చక్రిదగ్గరకు తనను జేర్చాడు—యిప్పుడు విడదీస్తున్నాడు; దీనికి ఎవరేం చెయ్యగలరు?

ఈ ఆందోళనను మరుగుపరుచుకుంటూ, 'లేదు బాబూ! చూడు. బైటెల్లా వాన కురుస్తోందో; గాలి ఎల్లా కొడుతోందో? మనం యిప్పుడు బైటకెడితే తడిసిపోతాం' అన్నాడు.

'యిదుగో—మనకు గొడుగు;' అని బుల్లి జపాన్ గొడుగు తెరిచాడు.

'అది గాలికి ఎగిరిపోతుంది—రేపు వెళ్దాం. పోనీ—బైట ఎవరైనా నడుస్తున్నారేమో చూడు'

చక్రి కిటికీలోంచి చూశాడు. బైట ఆ అర్ధరాత్రి ఎవ్వరూ లేరు. తాతయ్య చెప్పేది నిజమే ననుకున్నాడు. అయినా వాడ్ని ఏదో అనుమాన పిశాచం పట్టుకుపీడిస్తూనే వుంది.

'రేపు తప్పకుండా వెళ్ళాలి—తాతయ్యా!' తాతయ్యకు ఒక్కడికే చావుకుమార్గం తెలుసునన్నే వాడికి నమ్మకం!

'స—రే'

గడియారం పదకొండుగంటల్నీ భయంకరంగా కొట్టింది. చక్రి యీ ముసలితాతను వీడలేక—తనను విడిచివెళ్తా డేమోనని యింతవరకూ కళ్ళల్లో వొత్తులు వేసుకు మేకులాగు మేలుకొనే కూర్చున్నాడు. యింక వాడి కనురెప్పలు తెరుచు కుండేందుకు ఒప్పుకోవటంలా. గుంపులు గుంపులుగా వాడి నోటివెంట వొచ్చే అవలింతల్ని చూసి రామదాసు, 'యింక పడుకో బాబూ!' అన్నాడు.

'నువ్వుకూడా నాదగ్గర పడుకో తాతయ్యా—'

రామదాసు చక్రి యీ తుది కోరికను కాదన లేక పోయ్యాడు. వాడిదగ్గరే పడుకున్నాడు. వాడి శరీరానికి చలి గాలి తగలకుండా దుప్పటి కప్పాడు. తాతయ్యనూ, ప్రయా ణాన్నీ కూడా మరిచిపోయి నిద్రాదేవి కౌగిట్లోని పారవశతను

పూర్తిగా అనుభవించ సాగాడు. కరుచుకు పడుకున్నవాడల్లా రామదాసుకు క్రొద్దిక్రొద్దిగా సందివ్వసాగాడు. యిదే తనను భగవంతుడే వొచ్చి ఆ స్థలాన్ని వీడమని ఆజ్ఞాపిస్తూన్నట్టు రామదాసు తలిచాడు.

'ఉదయాన లేచి, చూసుకుంటాడు. తను నమ్మిన తాతయ్య చేసిన మోసం గుర్తించి ఏడుస్తాడు; ముసలివాణ్ని తిట్టుకుంటాడు; యింక యీ ముసలితాతయ్య నీకు కన్పించడు బాబూ! నిన్ను రేపట్నుంచే ఎత్తుకునేవాళ్ళూ, ఆడించే వాళ్లూ, వుండరు నాయనా! యివన్నీ నువ్వూ మరిచిపోవాలి; ఈ కఠిన విధికి అందరమూ బద్ధులమేగా: చక్రీ; యింక యీ తాతయ్య—యీ జీవితానికి యిదే నిన్ను కడసారి చూడటం' అనుకొని, యీ వినూత్న శాంతిమయ జీవితాన్ని తల్చుకొని దుఃఖిస్తూ, తన చిన్న చేతి సంచీని తీసుకొన్నాడు,

కుర్రవాడు యిదంతా చూస్తూన్నట్టే నిద్రలోనే బుగ్గలు గుంటలు పడేట్టు నవ్వాడు. రామదాసు వెంటనే వాడి మంచంమీద కూర్చొని, వాణ్ని తుదిసారి ముద్దుపెట్టుకొని, వాడి అభివృద్ధికోసం కడసారి దీవించాడు.

గడియారం అరగంట కొట్టిన కఠోరశబ్దమూ, బైట వానా, గాలీ కలిసివేసే ధ్వనీ విన్పిస్తున్నాయ్. గది మూల నున్న సన్నని దీపం అదిరదిరిపడుతోంది. ఎక్కడో గుడ్లగూబ అరుస్తోంది కాని, ఆ శబ్దం వాన శబ్దంలో మిళితమై స్పష్టంగా లేదు.

కళ్ళనీళ్ళు తుడుచుకొని, ఎవరితోనూ చెప్పకుండానే రామదాసు బైటపడ్డాడు. బుద్ధ భగవానుడు ఆనాడే రాత్రి నిద్రిస్తూన్న భార్యకూ, పుత్రుడికీ కూడా తెలుపని ద్రోహంచేసి పారిపోయిన ఘట్టం జ్ఞాపకానికొచ్చింది. చక్రికి చేసిన ఘోరాన్యాయాన్ని చేసి—లోకంలో పాపుల్లోకల్లా నేనే పాపిననుకుంటూ, ఆ చీకటి సముద్రంలో తప్పటడుగుల్తో, బరువైన హృదయంతో నడిచిపోసాగాడు.

చక్రి కలతనిద్రలో, 'తాతయ్యా!— తాతయ్యా!' అని కలవరించాడు, ఆ గది గోడలు మాత్రమే యిది విని, నవ్వుకున్నాయ్.

[ఒక బెంగాలీకథ చదివి]

— జనవరి 1945

# తోడు దొంగలు

"నమస్కారం శాస్త్రి గారూ!"

"ఓహో! చంద్రయ్యగారా! బహుకాలదర్శనం. యీ మధ్య అసలు మెడ్రాసే రావటంలేదల్లేవుంది...కూర్చోండి"

"పనులవల్ల తీరుబడిలేక రావటం లేదు...పత్రిక ఎలా వుందీ?"

"పత్రిక్కేం— ఒడుదుడుకు లేమీ లేకుండా దివ్యంగా సాగిపోతోంది. తమబోటి ప్రసిద్ధ కథలకు సహాయం ఉండగా సంపాదకుడు అలిసిపోయి విసుకుచెందాల్సిన పరిస్థితి ఏర్పడదు... అన్నట్టు మీ శిష్యుడు భలే పుస్తకం రాశాడే!"

"ఎవరూ?"

"సుబ్బారావండీ! ... సాంఘికవిప్లవంఅన్న యీ పుస్తకం అద్భుతంగా వుంది. యీ మధ్య నేను యీ మాత్రం మంచి పుస్తకాన్నే చూడలేదు. అదంతా మీ శుశ్రూష ఫలితం అని తెలుస్తూనే వుంది"

"ఇదా? ...కిందటేడు రాతప్రతి నా దగ్గరకు తీసుకొచ్చాడు..."

"మీరు ఉపోద్ఘాతంలో వెలిబుచ్చిన అభిప్రాయాల్తో నేను పూర్తిగా ఏకీభవిస్తాను—"

"అది కాదు...వినండి : నిజానికి ఆ అభిప్రాయాలు నేను హృదయ పూర్వకంగా ఇచ్చినవి కావు."

"అంటే మీరు రాసిఇచ్చిన అభిప్రాయాల్ని తనకు అనుకూలంగా ఉండేట్లు సుబ్బారావు దిద్దుకోలేదు కదా ?"

"లేదులెండి...కాని, నా వెంటపడి, నా అభిప్రాయాల కోసం గోజాలు తెరబడి నూ యింటిముందు పడిగాపులు కాశాడు. నాకు ఇంకో మార్గమేమీ కనబడక, యీ పీడను వొదిలించుకునేందుకు ఆ అభిప్రాయాల్ని రాసి ఇచ్చాను."

"ఇంకేం మీరు ఇష్టపడే రాసి ఇచ్చారుగా ?"

"ఇష్టమేమిటండీ ? నా స్టాండర్డ్‌కు సాహిత్య బాలుడు సుబ్బారావు రచనల్ని మెచ్చుకోవటంకన్న తలవొంపు వుంటుందా ? ఇక మెచ్చుకున్నానంటే— దానికి కారణం— వెళ్ళ తరబడిగా నన్ను నమ్ముకొని నా సేవ చేస్తున్నాడనీ, రాయకపోతే ఏడ్చిపోతాడనీను ! నాకు లోపల ఎలావున్నా సదభిప్రాయాల్ని రాసివ్వకపోతే అతనెలా అచ్చువేసుకో గలుగుతాడు ? 'నా రచన ఎలావుంది !' అని మొహంమీద అడుగుతే నిష్కర్షగా 'బాగాలేదు' అని ఎలా చెప్పగలం అందులోనూ నేనంటే అభిమానంతో భక్తితో ఉన్నవాడి విషయంలో ! 'మీ దయవల్ల నాలుగు కాపీలు అమ్ముకో కలుగుతాను' అని బతిమాలి భంగపడేవాణ్ని చూస్తే నాకు—నా కేమిటి— సున్నిత కళా హృదయంగల వ

మానవప్రాణికి హాని కలిగిస్తూ? మన పేరు పెట్టుకొని పాక టంతప్పు ఇంకో మూర్ఖుడు చేసినవానికి ఆ మాత్రం సహాయమన్నా చెయ్యక తప్పలేదు"...

"పోనిలెండి. పుస్తకంలో మంచి విషయాల్ని చర్చించాడు. మీ పాఠకులకు నిజంగా యీ పుస్తకం అర్థమైందే కనుక మీరేమీ విచారపడ నక్కర్లేదు"

"అది నేను కాదనను కాని—ఆ మాత్రం రచన సుబ్బారావు చెయ్యగలడా అని మొదట సందేహం కలిగింది పుస్తకం చదువుతూన్నంత సేపూ. అదంతా ఎక్కడో చదివిన జ్ఞాపకం బాగా పని చేసింది... ఎక్కడో జ్ఞాపకం రావటం లేదు. కాని సుబ్బారావు రచనా విధానంమాత్రం కాదని సాక్షిగా తెలుస్తూనే వుంది. యీ అనుమానంతో బాధపడలేక 'నిజంచెప్పు' అని నిలవతీసి అడిగేప్పటికి 'కోప్పడకండి...జోసఫ్ రాసిన పుస్తకానికి అనువాదం!' అన్నాడు. 'మరి అనువాదం అని ఎందుకు పెట్టలేదూ?' అన్నాను. 'అలారాస్తే నాకేం పేరువుంటుందీ? ఆ పొగడ్తలన్నీ రచయితకే చెందుతయ్ కదా?, అన్నాడు. పోనీ—ఏదో కుర్ర వెధవ పేరుకోసం పాకులాడు తున్నాడనీ, యీ ప్రథమ యత్నంలోనే దెబ్బతీసి వాణ్ని నిరుత్సాహపరచటం దేనికనీ పస్తాయించి ఊరుకున్నాను. వాడు నిజంచెప్పాక, వాడిమీద కోపానికి బదులు జాలికలిగింది. ఇది అనువాదమని నాకు తెలియనట్టూ, సుబ్బారావు స్వతంత్ర రచనని నేను నమ్మినట్టూ—ఉపోద్ఘాతం రాస్తే సరిపోతుంది లెమ్మని..."

"అట్లాగా ? ఉండండి... దేనికి అనువాదం అన్నారూ?"

"జోసఫ్ రచన...సోషల్ రివల్యూషన్..."

"ఇంకెందుకూ ? ఆపేర్లు నోటుపుస్తకంలో రాసుకున్నానుగా ! సుబ్బారావును యీదెబ్బతో కడిగి పారేస్తాను..."

"మీకు ఇంగ్లీషు రాదుకదా—మరి మూలంలోని విషయం ఎలా తెలుస్తుందీ ?"

"మీరు చెప్తే చాలదూ?"

"నిజానికి సుబ్బారావులాటి యువకుడు ఎంతైనా పైకి రావాలి. ఈయీడులోనే — అందులోనూ బాల్యావస్థలో ఇలాటి దొంగబుద్ధులు అలవాటైతే ముందు ముందు ఎందుకూ పనికి రాకుండా పోతాడు. ఇప్పుడే ఘాటుగా విమర్శిస్తే —వాడి కొకవిధంగా బాగుపడే మార్గాన్ని చూపినట్టే ! కాని క్షమించి ఊరుకుంటే తన గ్రంథచౌర్యం బైటపడలేదనీ, తన పుస్తకం చదివిన వాళ్ళందరూ ఒక్కియంబ్రహ్మాలనీ గట్టిగానమ్మి ఇంతకన్న ఘోరమైన చౌర్యాలకు దిగుతాడు. వాణ్ని సక్రమ మార్గంలో పెట్టాల్సిన బాధ్యత మీలాటి సంపాదకులకు ఎంతైనావుంది. అది మీవిధి. ఆంధ్ర సాహిత్యానికే అభ్యుదయం!"

"ఇంకెందుకూ వాడిపని పడతాను"

"పడితే పట్టావ్ కాని, నాపేరుమాత్రం బైటపెట్టేవు... సుబ్బారావు ఊళ్ళోనే ఉన్నాడు. ఒకవేళ మీదగ్గరికి వస్తాడేమో... తెలిసిందా?"

"ఎందుకు చెప్తావూ!"

"సరే...వస్తా..."

౨

"ఏం సుబ్బారావుగారూ!...రండి..."

"ఏమిటో దీర్ఘంగా రాస్తున్నట్టున్నారే!"

"మీ సాంఘిక విప్లవంమీద విప్లవం!"

"విమర్శనా?"

"విప్లవమే! జోసఫ్ రాసిన 'సోషల్ రివల్యూషన్' కు ఇది మక్కీకి మక్కీ అనువాదం రాస్తున్నాను. ఇలాంటివిమర్శ విప్లవం అనిపించుకోదా? ఏమిటీ అలా తెల్ల మొహం వేస్తారు?"

"ఆగు...ఆగు...భాయీ! నీకు ఇంగ్లీషు రాదుకదా! ఇది అనువాదమని రాసేందుకు ఎలా సాహసిస్తున్నావంట?"

"నాకు రాకపోతే ఏమయ్యా? లోకంలో ఆంగ్లభాష నీకు ఒక్కడికి తప్ప ఇంకెవ్వరికీ రాదని అనుకుంటున్నావల్లే వుంది! జోసఫ్ రచనంటే మారుమూలవి అనుకున్నావా— పాపం! ఎంత ప్రసిద్ధ రచయిత! వాడికే ద్రోహం తలపెడతావా?"

"అలా అంటే నేనేం చెప్పేదీ? పోనీ రాస్తే రాశావు కాని...నీకిది ఎవరు చెప్పారో చెప్పవూ?"

"అలా చెప్పటం అధర్మం!"

"యీ బ్రహ్మరహస్యం ఒక్కడికే తెలుసు ఆ చంద్రయ్యగాడే నీతో ఊదిఉండాలి.

"ఏం...ఐతే?"

"అలా దారికిరా...నామీదరాస్తే నాకేం కష్టం లేదు కాని, యీ సందర్భంలో చంద్రయ్యగాణ్ని మాత్రం వొదల వోక...ఇక నీ దగ్గరదాచి లాభం లేదు కనుక, అసలు కథంతా చెప్పేస్తాను—"

"కథా?"

"ఔను...నీకు తెలిసింది సగంకథే ఐఉండాలి. మిగతా సగమూ ఇదుగో: ఏదో పేరున్న రచయితకదానని రెండు సంవత్సరాలక్రితం చంద్రయ్య స్నేహాన్ని సంపాయించాను. ఆ మొట్టమొదటి రోజునుంచే నన్నూ నారచనల్నీ ఆకాశానికి ఎత్తడం మొదలు పెట్టాడు. అప్పటికి నావి ఏ ఐదారు రచనలో మారుమూల పత్రికల్లో అచ్చయినయ్. అందుకు ఆరురెట్ల రచనల్ని పోస్టు బిళ్ళలు పంపుకొని తిరిగి తెప్పించుకున్నాను. అచ్చయినవి చదివాడో లేదో కాని, చదివినట్టుగానూ, అవి తన అభిమానాన్ని ఆ వెంటనే సంపాయించగలిగినట్టుగానూ మాట్లాడేవాడు. ఆతని మాటల ధోరణి చూస్తే—ఆ పాతరచనలు నాదృష్టిలో కోల్పోయిన విలువను తిరిగి తెచ్చుకోవటమే కాకుండా, అంతకన్న గొప్ప రచనల్ని అసలు జీవితంలోనే రాయలేనేమో ననిపించేది. ఆతని పొగడ్తలకు కొత్తడన్‌లన్‌ట్యూబల్లే ఉబ్బిపోసాగాను:

ఒకప్పుడు అది పగిలి ఊరుకుంటుందనే ఊహాన్నా తట్టలేదు, ఇలా నా ఎదుటనే కాకుండా ఆయన నాసమక్షంలో, ఇతర స్నేహితుల దగ్గరకూడా నన్ను పొగుడుతూండేవాడు. ఆ పొగడ్తలకు నాఒళ్ళు పులకరించి, ఆకాశంవైపు చూస్తూ శిలా విగ్రహంలాగు నిలబడిపొయ్యేవాణ్ణి. పరిచయం ప్రారంభమైన రోజు మొదలూ, ఆయన రచనల్ని ఒకటికి పదిసార్లు చదివి (దాదాపు కంఠోపాఠంగా వుండేవి) నా స్నేహితుల ఎదుట పొగుడుతూండే వాణ్ని. ఈసంగతి ఆయనకు తెలిశాక 'అలా కలుపుగోరుతనంగా ఉండాలి' అన్నాడు. అతని పేరును నేనిలా ప్రచారంచెయ్యటం—అతనికి కీర్తిని రెట్టించటం—అతని పుస్తకాల్ని రైళ్ళల్లోతిరిగి అమ్మకపోయినా, స్నేహితులందరికీ అంటగట్టి డబ్బులు వసూలుచేసి ఆయనకు సమర్పించుకోవటం, మోతుబరుల్ని పట్టితెచ్చి ఆయన్ని పరిచయంచేసి, ఉన్నపలుకుబడినంతా ఉపయోగించి ముద్రణ ఖర్చుల్ని వసూలుచేసి వాళ్ళనెత్తిని అంకితం పారేసేట్టు చెయ్యటం — మొదలైన సపర్యల్లో నేనెప్పుడూ అశ్రద్ధ చూపలేదు. కాలేజీలో రెండు మూడుసార్లు ఆయన ఉపన్యాసాల్ని కూడా పెట్టించాను. వాల్‌పోస్టర్లు ఇవ్వలేనంత పబ్లిసిటీ ఇచ్చాను. బోర్డులురాసి-మెడలో వేసుకొని బజార్ల వెంట తిరగటం మినహాగా ఎన్ని రకాలుగా ఆయన పేరును పాకించాల్సిన అవకాశాలున్నయ్యో — వాటిలో దేన్నీవొదలి పెట్టలేదు. నా పేరుతోనూ, నాస్నేహితుల పేరుతోనూ—

ఆయన రేడియో ఉపన్యాసాల్నీ, నాటకాల్నీ మెచ్చుకుంటూ నా ఖర్చుమీద పోస్టేజవేసి—వేల ఉత్తరాల్ని రేడియో స్టేషన్ కు దిగుమతీ చేసాను. ఇలాటి సద్భాభిప్రాయాల్నీ, అభ్యుదయకరమైన పనుల్నీ అతనే ఒకసారి నోరిపోశాడు. చివరకు ఆతని అంతరంగిక మిత్రున్నయ్యాను...''

''నీ జీవితకథంతా చెప్తున్నావే!''

''లేకపోతే నీకసలు అర్థంకాదు...విను: అతను నన్ను శిష్యుడనేవాడు. నేను 'గురుజీ!' అనేవాణ్ని. అతని ఫోటో నొకదాన్ని మా ఇంట్లో-లక్ష్మీదేవి బొమ్మతీసేసి ఆస్థానంలో పేళ్ళాడేశాను. ఆ ఫోటోకి రోజూ హారతికర్పూరపు పొగలు వేసి, పూలదండల్తో అలంకరిస్తూనే ఉన్నాను. ఏకాస్త సందర్భం వచ్చినా (రాకపోతే దాన్ని ఎలాగో కల్పించి కూడా!) అతన్నిగూర్చి గొప్పగామాట్లాడేవాణ్ణి. వినేవాళ్ళు దొరకాలేకాని—నాఖర్చుమీద కాఫీపోయించి గంటలతరబడి వాగేవాణ్ణి. ఎన్నిసార్లు మెడ్రాస్ వొచ్చి (నా జేబులోని డబ్బుల్తో!) ప్రతి పత్రికాఫీసుకూ వెళ్ళి ఆయన్ను గూర్చిన దండకాల్ని ఏకరువు పెట్టేవాన్నో—పత్రికా సంపాదకుడివైన నీక్కూడా బాగా తెలుసు. మహా ప్రవాహం ఒడ్డున చాపలు పట్టేవాడిమాదిరిగా రోడ్డుపక్కనే రోజూ కాపలావేసి ముఖపరిచయమౌంటూ ఉన్న వ్యక్తి కనిపించటమే తడవుగా గురుజీ లీలల్నీ, సాహిత్యంలోని వారి అపారానుభవాల్నీ నవరస భరితంగా వర్ణిస్తూండేవాణ్ణి. యీ విధంగా చెమటోడ్చి కృషి చేసి దేశంలో అతనికి పెద్ద పేరును సంపాయించి పెట్టాను...''

'తరవాత...?...త్వరగా కానీ—'

''కాస్త ఓపిక పట్టుమరి...కొంతకాలం గడిచాక నన్నొక పుస్తకం అచ్చువేయమన్నాడు. 'నీకంటే శిష్య గణం వుంది. నాకేమీ లేదు. నేను రాసే పుస్తకం అమ్ముడు కావొద్దా!' అని అడిగాను. తను పరిచయవాక్యాలు రాస్తా ననీ, అందులో నన్ను స్వర్గానికి దగ్గరిగా ఎత్తిపడతాననీ, తన పాఠకులందరూ పుస్తకం కొంటారనీ—బోగడ రంగయ్య పద్యాలసంపుటి సందర్భంలో ఎడిటర్లందరికీ వ్యక్తిగతస్నేహ లేఖల్ని రాసి (రికమన్డేషన్లు అను!) పుస్తకవిమర్శల్లో సదభిప్రాయాల్ని ఇప్పించినట్టే చేయగలననీ వాగ్దానాలు చేశాడు. దాంతో నాకు పెరపెగలాడి 'నేనంత బాగా రాయలేనే?' అన్నాను. 'స్వంతంగానే ఎందుకు రాయాలి? యీ పుస్తకం చదువు. తెలుగులో దించేసెయ్!' అని పుస్త కంఇచ్చాడు. నిజానికి పుస్తకం చాలాబాగుంది. తెలుగులో రాసి తెచ్చాను. చదివి 'చాలా బాగాచేశావ్. కాని. అనువాదం అనేమాట తీసేసెయ్' అన్నాడు. 'ఎవరైనా పట్టు కుంటే?' అన్నాను. 'ఎవరూ పట్టుకోరు. ఇందులోని రహస్యం ఏమిటంటే ఇంగ్లీషు వొచ్చినవాళ్లందరూ ఆ సాహిత్యాన్నే చదువుతారు కాని, తెలుగు జోలికిరారు; ఎందుకంటే లోకం లోని మంచి సాహిత్యమంతా ఇంగ్లీషుభాషలోనే వుంది. ఇక ఇంగ్లీషు రానివార్లకు ఇది స్వంత రచనో, అనువాదమో ఎలా తెలుస్తుందీ? పోతే, నేను పరిచయ వాక్యాలు రాస్తాం

డగా ఇంకెవరు ధైర్యంచేసి పట్టుకో గలుగుతారు? నీకేం భయంలేదు. అనువాదమని వేస్తేమాత్రం నీకేమీ పేరు రాదు.' చివరకు అతని సలహా అంగీకరించాను. పరిచయ వాక్యాలు రాసిఇచ్చారు. అద్భుతంగా ఉంది. 'పుస్తకానికి తగ్గట్టు రాశారు' అన్నాను. 'అదికూడా జోసఫ్‌దే! 'నా రచనలు' అనే అతని పుస్తకంలోని పదకొండో అధ్యాయం మొత్తం మొత్తం తెలుగు చేశాను' ఆ సంతోషంలో నోరు జారి. నాకు ఆశ్చర్యమైంది. తొలి పలుకులు కూడా గురుజీ స్వంతం కాదన్నమాట! జోసఫ్ రాసిన 'నారచనలు' అనే పుస్తకం కొని, పదకొండో అధ్యాయం చూశాను. మక్కీకి మక్కీగా సరిపోయింది. అప్పుడు నాకు మరీ ధైర్యంకలిగింది. నాతోపాటు పట్టుబడే గురూజీ ఉండనే ఉన్నాడుగా!'

"ఐతే ఉపోద్ఘాతం కూడా జోసఫ్‌దే నన్నమాట?... ముందు ఆపేర్లు చెప్పు... రాసుకోవాలి."

"జోసఫ్ రచన 'మైబుక్స్' అనే పుస్తకం. పదకొండో అధ్యాయం—మొత్తం మొత్తంగా!"

"సరే...వాడి పనికూడా పడతాను కాని, ఒక్క శరీరంగా తిరిగినవాళ్ళు మీరిద్దరూ ఇలా తయారయ్యారేం?"

"మొదట్లో యీ కీలకం తెలియక నా స్వంత వ్యయం మీదా, శ్రమమీదా ఇంత ప్రచారంచేసి ఇంతవాణ్ని చేశానా—కిందటేడు సినిమా డైలాగ్స్ రాసి, ఆపాట ఫిలిం కంపెనీలేపి, నాకున్న రెండెకరాల భూమినీ అమ్మి

పెళ్ళికోసమని వేధించాడు. నాకది ఇష్టంలేక తప్పించుకొని తిరగటం మొదలెట్టాను. అప్పట్నుంచీ నాతో విరోధంగా ఉంటూవచ్చాడు. నా పరోక్షంలో నన్ను దూషించటమూ, నా సమక్షంలో ముభావంగా ఉండటమూ సాగించాడు. రెండు మూడుసార్లు తను రాసిచ్చిన ముందుమాటల్ని తిరిగి ఇమ్మన్నాడు. నేను ఇవ్వదలచ లేదు—అతన్ని సాధించేందుకు నాకు మిగిలిన ఆయుధం అదొక్కటే కనుక ! ఆపని కాస్తా చేసిపారేశాను. ఇన్నాళ్ళూ ఎత్తిపట్టిన అతన్ని ఇప్పుడు దూషించటమంటే ప్రాణాంతకంగా ఉండబట్టి, మొదలకుండా కోపాన్నంతా దిగమింగి చచ్చినట్టు పడిఉన్నాను. నన్నూ నా స్నేహితుల్ని తన పేరుకోసం బాగా ఉపయోగించుకున్నాడు. తన అవసరం తీరగానే మమ్మల్నందర్నీ తృణీకరించాడు. ఇలాంటి నీచుల్ని మాత్రం నువ్వు వొదలొద్దు భాయీ !''

'నేనేనా వొదిలేది?'

'సరే...మరిచిపోవోక...వొస్తాను మరి...'

—జనవరి 1948

# జారే కాళ్లు

అది కలమాత్రం కాదు. తను జీవితాంతం వరకూ నమ్మిన భర్త—తనను ఎంతో గాఢంగా ప్రేమించాడని భ్రమపడే వ్యక్తి—పొరుగింటి వరలక్ష్మితో రాత్రులు గడుపుతూన్నట్టు ప్రత్యక్షంగా చూశాక—తను నమ్మకుండా ఎలా ఉండటం?

జరిగిన విషయాలు అనేకం ఆమెకు జ్ఞాపక మొచ్చినై. తనతోడి స్నేహమనే వంకమీద వరలక్ష్మి రోజూ తన యింటికి రావటం, తను ఆమెను నమ్మి భర్త యెదుటకూడా ఆమెతో స్వేచ్ఛగా మాట్లాడటం, ముగ్గురూకలిసి కబుర్లు చెప్పుకుంటూ నవ్వటం—ఇదంతా తన కాపురానికి మోసం తెస్తుందని తను అనుమానించక పోవటం—రూఢిపడ్డ యీ విషయాన్ని తలచుకొని ఇప్పుడు బాధపడటం మొదలైన వన్నీ ఆమెను దుఃఖింపజేశాయి. తనలో ఏం లోపముందని భర్త పర స్త్రీ కోసం చెయ్యిజాపాలి? తన దర్శనం కోసం ఒకటికి పదిసార్లు రోజూ సాయంత్రం ఆవీధి వెంట తిరిగే యువకులే తన సౌందర్యాన్ని చాటుతున్నారు. కిందటిసంవత్సరం, తను కన్పిస్తేనే చాల్ననే ఉద్దేశంతో, అద్దెచాలా ఎక్కువైనా పక్కింటి మేడమీది గదితీసుకొన్న విద్యార్థులు తనకోసం ఒకళ్ళకు తెలియకుండా ఒకళ్ళు విశ్వప్రయత్నం చేసి చివరకు తనచేత నవ్వించటం కూడా చేతకాక తోక

ముడిచిన విషయాన్ని తనెల్లా మరచిపోగలదు ? ఆసమయంలో తనేమైనా చలించిందా ? భర్తకు ద్రోహం చేయాలనుకుంటే ఎంతలోపని ? మూడు సంవత్సరాల్నుంచీ కాపరం చేస్తూన్నా యీ భర్తకు యిదేం దుర్బుద్ధి ? తనవల్ల ఏ అసంతృప్తి కలగకపోయినా భార్య అనే గోషను అడ్డంపెట్టుకొని 'చెడుప్రవర్తన' అనే పేరు రాకుండా విహారించేందుకేనా యీ పెళ్ళిచేసుకుంది ? పోనీ తనవల్ల ఏమైనా తప్పుంటే చెప్పకూడదూ ? ఛీ—అందుకనే మొగాళ్ళను నమ్మకూడదన్నారు.

పోనీ భర్తను నిలవదీసి ఇవన్నీ అడుగుతే ? తలాయించి సమాధానం చెప్తాడు; అతను భార్యకు భయపడే భర్త అయితేగా ? అన్ని విధాలా స్వాతంత్ర్యాన్ని సంపాయించుకు కూర్చొని, తనను నమ్మిన భార్య ఎక్కడికి పోతుందనే ధీమాగల వ్యక్తికి తనంటే ఏం లెక్క ? ఒకవేళ ఒకవిధంగా తన తప్పును ఒప్పుకొని—ఇక ముందు ఆ తప్పును చెయ్యనని కల్లబొల్లి వాగ్దానాలు చేసినా—ముందు తన కళ్ళపడేట్టు ప్రవర్తిస్తేగా—తను పట్టుకోగలిగేది ? ఇన్నాళ్ళూ తను ఎరుగని తావుల్లో తన ఊహ చొరని ప్రదేశాలలో ఆపని చేస్తే తనేం గ్రహించగలిగింది ? కుక్కతోకలాటి మానవ ప్రకృతిని తనెల్లా విశ్వసించగలదు ?

తలుచుకొన్న కొద్దీ ఆమె ప్రతీ అవయవమూ వొణికింది, ఒళ్ళు మండింది; భరించలేని బాధంతా కన్నీళ్ళరూపాన

వెలువడి—తలగడా తడవటంగా మారింది. ఆ పని చెయ్య కుండా ఉండేందుకు శిక్షాస్మృతి తన చేతులలోనే ఉందేనా? తనలాంటి సర్వాంశకు యీ ఇల్లు యికముందు నివాసయోగ్యం కాబోదేమో? కాదు, ఇదే నిశ్చితాభిప్రాయం. అంతకన్న తను చెయ్యగలిగింది కూడా లేదేమో?

కాళ్ళ చప్పుడు విని కళ్ళనీళ్ళు తుడుచుకుంది. భర్తవచ్చి, కళ్ళూ ఎరగనట్టు రెండో మంచం మీద పడుకున్నాడు. తన వైపైనా చూడలేదు. అతని వాలకం భరించరాని దైంది.

గట్టిగా దగ్గింది, భాస్కరం ఆమె వైపు తిరిగి, "నువ్వింకా నిద్రపోనేలేదా?" అన్నాడు.

"ఆఁ...పిల్లి కళ్ళుమూసుకొని పాలుతాగుతూంటే..." అంది పొడిగొంతుకతో.

"నీ మాటల ధోరణి అర్థమవటంలేదు" అన్నాడు. ఆమె కోపాన్ని గుర్తించి.

తన హృదయంలోని బరువైన మాటల్ని భర్తముందు పడేసి, కొంత బాధను తగ్గించుకోవా లనుకుంది. కాని అందుకు ఆమె అభిమానం అడ్డుపడి, 'చెప్పి మాత్రం ఏం లాభం?' అని బోధించింది.

"నేను రేపు వెళ్ళిపోతాను—"

"ఎక్కడికి?"

"పుట్టింటికి"

"ఎందుకనీ ?"

"నాయిష్టం—" తనను లెక్క చెయ్యని భర్తకు ఏ కారణాల్నీ చెప్పక, ఇలాటి తలబిరుసు సమాధానాల్తో అతని మనస్సు నొప్పించటం ఆమెకు తృప్తిగా తోచింది.

భాస్కరం కనుబొమల్ని చిట్లించి, "కారణం యేమీ లేదన్నమాట" అన్నాడు.

"ఊహుఁ."

"అంతకోపంగా ఉన్నావ్ దేనికి ?"

"ఏమీ లేదు... రేపు వెళ్తాను."

"కారణం ?"

"ఏమీ లేదు — నేను వెళ్ళాలి — అవసరం కనుక" ఇంకా సంభాషణను పొడిగించటం కూడా ఆమెకు అనవసరంగా తోచింది.

తరువాత భాస్కరం ఎంతో బతిమాలుతూ ఆమెను కారణ మడిగాడు. ఆమె చెప్పలేదు—భర్తమీది కోపం ఆమె పుట్టింట్లో కాలుపెట్టేదాకా పోలేదనే చెప్పాలి.

*　　*　　*　　*

ఇప్పుడు తనభర్త ఏంచేస్తూంటాడు ? తను లేని యీ నెలరోజులూ జీవితంలో వృధా అయినయ్యని విచారిస్తూంటాడా ? లేక తనులేనిదే పదివేలుగా భావించి, తనిచ్చే ఆనందాన్నే ఆవరలక్ష్మితో అనుభవిస్తూ, ఊరేగుతుంటాడా ?

ఇంతవరకూ భర్త తనకు ఒక్క ఉత్తరమన్నా రాయక పోవటమే అతను తనను లెక్క చెయ్యలేదనే అభిప్రాయాన్ని రూపిస్తోంది.

తనకన్న తక్కువ అందగత్తయిన వరలక్ష్మితో—తనవా డనుకొన్న భర్త, తన ఇంట్లో స్వేచ్ఛగా విహరించటాన్ని ఆమె ఊహించుకుంది; అదంతా తనఎదుటనే జరుగుతూన్నట్టు భావించి కంపించింది—కాస్త ఆలోచించి ఆవిషయాన్ని తలచుకోవటమే గొప్పతప్పేమో ననుకుంది—

"ఏమిటీ దీర్ఘాలోచనలో ఉన్నావ్ ?"

శ్రీధరాన్ని చూసి లేని చిరునవ్వును పురస్కరించు కుంటూ "ఏమీలేదు—ఏమీఆలోచటంలేదు—" అంది.

"భర్త దగ్గరలేకపోతే—కాపరాలు చేసేవాళ్ళకు ఏం తోస్తుందిలే."

ఎంత ధైర్యంగా అన్నాడు! మేనమామకొడుకు; చిన్న తనంనుంచీ స్వాతంత్ర్యం గలవాడు కనుకనే ఇంత చొరవగా మాట్లాడాడు. ఐనా అతనన్నది నిజమేనేమో ? అనవస రంగా లేనికోపాన్ని తెచ్చి పెట్టుకోవటం దేనికి ? అందుకనే నవ్వి ఊరుకుంది.

శ్రీధరం జేబులోంచి కొత్తగాకొన్న ఫౌంటెన్ పెన్‌ను తీసి. "సుశీ! యీ కలం బాగుందా ?" అన్నాడు, కలాన్ని ఆమెకు అందిస్తూ.

ఆమె కలాన్ని అన్నివైపులనుంచీ పరీక్షించి చూసి, "ఓ...చాలా బాగుంది.. ఎంతకు కొన్నావ్ ?" అంది.

"ఆరుం ముప్పావలా—"

"ఎందుకూ ? మా వూళ్ళో దీన్ని రూపాయి పావలాకు ఇస్తారు...బలే టోపీలోపడ్డావే బావా !" అని సుశీల నవ్వేసాగింది.

శ్రీధరం కోపాన్ని నటిస్తూ, "ఊరికనే ఇస్తున్నారు కదూ ? ఇస్తే ఇచ్చారులే—నాది నాకివ్వు—" అన్నాడు.

"నాకు కావాలి."

"ఎందుకూ? మీఆయనకు విరహలేఖలూ, ప్రేమలేఖలూ రాసుకుంటావా ?"

సరసాన్ని భరించటం సుశీలకు మొదటినుంచీ అలవాటే ! అందులోనూ చిన్నతనంనుంచీ యీ ఇంటికప్పుకింద తనతో ఆడుకుంటూ చదువుకుంటున్న బావదగ్గర తనకున్న స్వాతంత్ర్యంతోనే, "ఆఁ...ఆఁ...రాస్తాను" అని నవ్వసాగింది.

"అక్కర్లేదు...నాది నాకివ్వు."

"ఇవ్వను—"

శ్రీధరం కలాన్ని ఆమె చేతుల్లోంచి లాక్కోవాలని చేతుల్నిజాచాడు. ఆచేతులకు అందకుండా పక్కమీదవాలి చేతుల్ని వెనక్కుజాచింది. శ్రీధరం ఆమె మీదిగా ఒరిగి కలంకోసం చెయ్యిజాపాడు. ఆమె ఇంకా సరసంతోనే నవ్వుతోంది. తన శరీరాన్ని బావశరీరం తాకుతోందన్న దృష్టి

కూడా ఆమెకు లేదు. కాని ఆస్పర్శ శ్రీధరానికి ఎక్కడలేని ఉత్సాహాన్ని ఇచ్చింది. తనను గట్టిగా ముద్దుపెట్టుకొనే దాకా, సుశీల తనస్థితిని గ్రహించుకోలేక పోయింది.

"ఛా...లే" మరి తన నోటివెంట మాటల్ని రానుండా శ్రీధరం తన చేతితో మూసివేశాడు. ఒక్కసారి అతని కళ్ళలోకి చూసింది. ఎంత ఆశతో, ఆకలితో అవి తనను అర్థిస్తున్నాయో అర్థమైంది—బావ! ఒకే కంచలో భోం చేసి, బావ పక్కలోనే పడుకొని రాత్రి చాలా పొద్దుపొయ్యే దాకా పిట్టకథల్ని చెప్పుకుంటూ గడిపిన చిన్ననాటి రోజుల్ని ఆమె మరిచి పోలేదు. కాని ఆబావే యీనాడు వేరొక రూపంలో, వేరు గమ్యస్థానాల్నీ ఆశయాల్నీ పురస్కరించుకొని—తనతోడి స్నేహాన్ని కోరుతున్నాడు.

"అబ్బ—లే—ఎవరైనా వస్తారు" ఆ మాటల్ని ఎందుకు అన్నదో ఆమెకే తెలియదు.

పక్క గదిలో నిద్రిస్తూన్న తల్లిదండ్రులు చూసి పోతారేమోనన్న భయంవల్ల అల్లా అంటూన్నదనే దురభిప్రాయంతో, శ్రీధరం మెల్లిగానవ్వి "తలుపులు గడియవేసే వచ్చాను" అన్నాడు. తనెంత జాగ్రత్తపడ్డాడో తెలియజేస్తూ.

శ్రీధరం వింత ప్రవర్తనను ఆమె ఏవగించుకుంది. కాని అతను పట్టు విడవకుండా, తనకు యిష్టంలేని తావుల్లోకి బలవంతాన లాగుతూన్నట్టు, పెనుగులాడుతున్నాడు, ఆమె

కూడా యీ అసందర్భపు వేళాకోళాన్ని తప్పించుకోవాలని ప్రయత్నించింది. మౌనంతోనే కొంతసేపు పోరాడి ఓడి పోయింది. అలసిన ఆమె ముఖాన్ని బావ కోరి కోరి ముద్దు పెట్టుకుంటున్నాడు—

బావంటే ఆమెకు ఇష్టంలేకపోలేదు. కాని ఆమెలో జీర్ణించిన పాతివ్రత్యం ఒకమూల తిరుగుబాటు చేస్తోంది. ముఖం పక్కకు తిప్పి కిటికీలోంచి చూసింది. నింగిలో నక్షత్రాలనడుమ చంద్రుడు నవ్వుతూ, 'ఒకరాత్రి వృథా అవుతోందిసుమా!' అంటున్నట్టు తోచింది. కోపంవల్ల యీ నెల రోజులూ కన్పించని కామం ధూమరూపాన ఆమె శరీరానంతట్నీ ఆక్రమించసాగింది. బావ నోటినుంచివచ్చే సువాసనా తన మీదుగా అతను పీల్చేగాలీ—ఆమెకు అనుభవించిన కొన్ని సౌఖ్యాల్ని జ్ఞాపకం చేస్తున్నయ్. ఒకమూల భయమూ సిగ్గూ కలిసి వెనుకంజ వేయిస్తున్నాయి. ఇదివరకు కాలేజీ స్టూడెంట్సు దగ్గర పనిచేసిన నిగ్రహం, సమయానికి ముఖం తప్పించింది.

ఆమె వాంఛ ఎలా వృద్ధిపొందిందోకాని—ఆమెకు ఇదివరలో గ్రహించలేని కొత్తదనం శ్రీధరంలో కన్పించింది. యవ్వనపు విలువను—ఆరాత్రికీ, చంద్రుడికీ, చలిగాలికీ ఇప్పించగలుగుతూన్న బావ రసికత్వాన్ని ఆమె బాగా బోధపరచుకో గలిగింది. అతన్ని వారించటంకానీ, అతనిలోని దోషాన్ని గుర్తించటం కానీ ఆమె చెయ్యలేక

పోయింది. యుద్ధంలో గెల్చి ఆక్రమించుకొన్న రాజ్యం లాగు—శ్రీధరం ఆరాత్రి ఆమె శయ్యమీాది సగభాగాన్ని ఆక్రమించుకో గలిగాడు—

తెల్లవారుఝామున చీకిచీకి విసిరిపారేసే మామిడిటెంక లాగు, పగిలిన సీసాముక్కల్ని గిరాటేసేమాదిరి ఆమెను ఒక పక్కకు నెట్టి, శ్రీధరం వెనక్కయినా తిరిగి చూడకుండా గదితలుపు తీసి పిల్లిలాగు బైటికి జారేదాకా ఆమె తన స్థితిని గ్రహించుకో లేక పోయింది. చిరుచెమట్లు పోసిన ముఖాన్ని తుడుచుకుంటూ, రేగిన తలవెంట్రుకల్ని పైకి తోసుకుంటూ ఆమె లేచి కూర్చుంది. నలిగినచీరె, పరుపు మీాద ముడుతలుపడ్డ దుప్పటీ ఆరాత్రి ఇంతవరకూ జరిగిన కథను చెప్పున్నాయ్. మూలనున్న బెడ్ లైట్ 'నేను అంతా చూస్తూనే ఉన్నాను' అంటోంది.

ఎంత అపచారం జరిగింది! తన శరీరం మీాద యీ రాత్రి రెండో వ్యక్తి అధికారాన్ని సంపాయించాడు. బావను తనెందుకు వారించలేకపోయింది? తన మౌనాన్ని అంగీకారంగా భావించబట్టే—అతను తనను అనుభవించగలిగాడు. అసలు అది తనక్కూడా ఆనందాన్నివ్వబట్టే—ఏ అవినీతీ, ఏ భయమూ, ఏ పాతివ్రత్యమూ, ఏ నిగ్రహమూ, ఏలోకమూ తనకు ఆ క్షణాల్లో గుర్తురాలేదు. తన ఆదర్శాలన్నీ భగ్నమౌతున్నా ఎలా సహించగలిగిందో ఆమెకు అర్థమవ లేదు,

తన భర్త పరస్త్రీ పాలయ్యాడని తనెంత ఈర్ష్యపడ్డది! అతను తనను ప్రేమించటం లేదని అపోహపడి, అతనిమీద కత్తికట్టి రెక్కలు కట్టుకొని ఈ శాంతిమయ ప్రదేశానికి వచ్చింది. కాని ఇక్కడే తనుకూడ కాలుజారింది. భర్తమీద తనకు ఇష్టంలేక కాదు; అతన్ని సాధించాలనీ కాదు; పరపురుషుడితో తను ఆనందాన్ని అనుభవించాలనీ కాదు—మరి ఏ యితర కారణమో తను జీవితాంతం వరకూ ఏకదీక్షగా ఆలోచించినా చెప్పలేదు! భర్తకూడా ఇలాగే కాలుజారి ఉంటాడేమో?

తార, అహల్యలలాటి పతివ్రతలు ఎలా కాళ్ళు జారారో ఆమెకు జ్ఞాపకం వచ్చింది. మానవులు ఎలా కాళ్ళుజారుతారో కూడా ఆమెకు అర్థమైంది. ప్రతితప్పుకూ శిక్ష అంటూ వుంటే—జీవితమంతా 'శిక్ష'లోనే గడపాలేమో ననే అనుమానం కూడా ఆమెను బాధించింది.

ఏమైనా యీ ఇల్లు ఆమెకు ఒక్కక్షణంకూడా నివాస యోగ్యంగా తోచలేదు—తన శీలాన్ని బలిగొన్న కొంప!

తెల్లారగానే తండ్రితో, 'నేను యీ మధ్యాహ్నం బండికి వెళ్తాను—' అంది.

'అంత తొందరేం?' అన్నాడు తండ్రి.

'ఆయనకు హోటల్ తిండి పడదు—' ఇంకేమేమో కారణాల్ని చెప్పి ఒప్పించింది.

రైల్లో ఎక్కించేందుకు శ్రీధరం వచ్చాడు. ప్లాటుఫారం మీద ఒకమూల జేరాక 'ఇంత తొందరగా వెళ్ళిపోతున్నావేం?' అన్నాడు.

'నిన్ను వశంచేసుకున్నాను—చూశావా' అన్నట్టు మెరుస్తూన్న అతిని కళ్ళల్లోకి ఆమె చూడలేకపోయింది. ముఖం పక్కకుతిప్పి, 'ఊరకనే—'అంది.

'నన్నుకూడా రమ్మంటావా?'

'ఒ—ద్దు'

'ఈమాట రాత్రి అనలేకపోయ్యావ్!' విజయసూచికంగా నవ్వాడు! 'సుశీలా! నీ శీలం చెడిందిసుమా!' అన్నట్టు చూసిన ఆ వాడిచూపులకు ఆమె అభిమానంతో కుంగిపోయింది. తప్పుచేశాక అందరూ వేలెత్తి హేళనచేసేవాళ్ళే కాబోలు! తనమీద ఒక్కరాత్రి పట్టుబలవంతాన, విధివశాన అధికారాన్ని సంపాయించినంత మాత్రంచేత, ఎంత గర్వంగా అవమానకరంగా మాట్లాడాడు! తను అతని చరణదాసి అయినట్టు ఆ కంఠమే చెప్తోంది. కాని ఆమె రైలెక్కాక కూడా 'మరిచిపోకండి—'అన్నాడు హేళనగా, 'నీలాంటిది నాకొక లెక్కా?' అన్నట్టు చూసి విషపునవ్వు నవ్వుతూ.

ఆమె ఇల్లు జేరేదాకా ఆమాటలూ, ఆ నవ్వూ ఆమె చెవుల్లో ప్రతిధ్వనిస్తూనే ఉన్నయ్.

భర్త "అప్పుడే వచ్చావేం?" అన్నాడు మామూలు ధోరణిలో. తనతప్పు అతనికూడా తెలిసిందేమోనని ఎంత బాధపడ్డది! అంతరాత్మ ఎంతగా ఏడ్చింది!

తలవంచుకొనే సమాధానం చెప్పింది. "ఉండ లేక పొయ్యాను—మీరు లేకపోతే—" మాట పూర్తి కాక ముందే అనురాగాన్ని సూచించె అతనిచేతులు ఆమెను దగ్గరకు లాక్కున్నాయ్. ఎంతలో క్షమించాడు!

రాత్రి భోజనా లయ్యాక సుశీల గదిలో ప్రవేశిస్తూ, "వరలక్ష్మి ఊళ్ళో లేదా?" అంది.

"వాళ్ళు ఇల్లు మార్చారు—"

ఆమె ఆశ్చర్యపడి. "ఎప్పుడూ?" అంది.

"నువ్వు వెళ్ళిన పదిరోజులకు"

"ఎందుకనీ?"

ఈ ప్రశ్నకు భాస్కరం వెంటనే సమాధానం చెప్పక కొంచెంఆగి, నీళ్ళు నములుతూ, "ఏమో?" అన్నాడు.

"అబ్బ—చెప్పండి—" అని ఆమె సాగదీసింది. కొంత సేపు ఆమెచేత బతిమాలించుకొన్నాక, భాస్కరం మెల్లిగా "భర్త ఆమెమీద అనుమానపడి—" అని ఊరుకున్నాడు. ఆమె పకాలున నవ్వింది—తనకంతా అర్థమైనట్టు—

'ఆ అమాయకుడికి మనుషులు ఎందుకు తప్పులు చేస్తారో ఇంకా తెలియదు కాబోలు!' అనుకుంది. భర్తముఖంలోకి, 'ఇంతేకద!' అన్నట్టుచూస్తూ.

# జీవితాశయం

డాక్టర్ అన్నాడు: ఏనీ పరిస్థితి చాలా క్లిష్టంగావుంది. ఆమె యీ కాన్పుకు యమయాతనలు అనుభవించాల్సిందే! ఇప్పుడు ఆపరేషన్ చేసి బిడ్డను తీసేస్తాయితే ఆమె ప్రాణాని కేమీ భయంలేదు; కాని బిడ్డ బతకదు; గర్భకోశపు తిత్తిని కత్తిరించివేయవలసి వుంటుంది కనుక—ఆమెకు మరి సంతానం ఉండదు. ఆపరేషన్ చెయ్యకపోతేమాత్రం బిడ్డ జీవం తోనే బైటపడుతుంది. కాని తల్లి ప్రాణానికి నాకేమీ ఆశ కనిపించటం లేదు—మీ నిశ్చితాభిప్రాయం ఏమిటి?

నిశ్చయం! ఇలాంటి దుర్ఘటనలో నిశ్చయానికి రావటం మానవమాత్రుడి తలకు మించిన విషయం—

"నేను అన్నీ సిద్ధం చేసుకుంటున్నాను. అరగంటలో వొచ్చి మిమ్మల్ని కలుసుకుంటాను. యీలోగా ఏదో వొకటి తేల్చుకోండి" అని డాక్టర్ వెళ్ళిపొయ్యాడు.

సోమ్స్ కేమీ తోచటంలేదు. తను ఒంటరిగా ఉన్నాడు. తన అత్తగారు మర్నాటి మధ్యాహ్నానికిగాని రాలేదు. విషయం అంతవరకూ ఆగేది కాదు. అరగంటలోనే ఏదో వొక వొడ్డు తేల్చుకోవాలి. తనకు ఉన్న కాలమంతు ముప్పై నిమిషాలు...ఆకొద్ది వ్యవధిలోనే ఒక జీవిత సమస్యకు తను జవాబు చెప్పాలి...!

సోమ్సు చెవులు మూసుకున్నాడు. ఏశబ్దమూ వినిపించక పోవటం మరీ దుర్భరంగా తోచి — పాలభాగాన్ని తడుముకున్నాడు. శీతకాలపు చలిలోకూడా అతని నుదుటిమీది శ్వేతబిందువులు అతన్ని మరింత భయపెట్టినయ్.

మేడమీది గదిలో తనభార్య ప్రసవవేదన పడుతూ వుంది. ఆమె బాధతో మూలగటం సోమ్సు భరించలేక పోతున్నాడు.

తన స్థితితో యీ కాలానికి నిమిత్తంలేదు. తననిశ్చయం కోసమే ప్రకృతిశక్తులన్నీ వేచికూర్చున్నాయ్. ఆలోచనలతో కాలాన్ని వెళ్ళబుచ్చుతున్నాడేమో? కాని అనాలోచితంగా మాటజారాడంటే జీవితాలే తలక్రిందులౌతవి—

ఆ ముప్పై నిమిషాల్లోనూ అతని కళ్ళఎదుట ముప్పై సంవత్సరాల జీవితం కదిలిపోయింది...

తనకు లెక్క కట్టలేనంత ఆస్థివుంది. తన మొదటిభార్య —ఇరానీ లేచిపోయింది. తన సంపదను ఆమెకాలతన్నింది. ధనంఅనేది నిరుపయోగమైనదని నిరూపించే సంఘటనను సృష్టించింది. ఆమె తన పినతండ్రి కొడుకుతో లండన్‌లోనే వేరే కాపరం పెట్టింది. వారు బీదరికంలోనే ఏ ఆనందాన్ని అనుభవిస్తున్నారో తనకు ఇప్పటికీ తెలని సమస్యే! ఏమైతే నేం? తనభార్య లేచిపోయింది కాని — ఆమెతోపాటు తన సంపదకానీ, అందులోని భాగంకానీ లేచిపోనందుకు తను ఆనందించాడు. పైపెచ్చు ఆసంపద క్రమంగా పెరుగుతూనే

వొచ్చింది. అంత సంపదనుచూసి తనకుమతిపోయిన క్షణాలు కూడా జీవితంలో లేకపోలేదు.

ఒకనాటి సాయంత్రం యీవినింగ్ ఎడిషన్ దినపత్రికలో 'జననం' శీర్షికలో—ఇరానీ ఒక కొడుకును కన్నట్లు చదివాడు...తనకు మతి పోయినట్లనిపించింది. తనభార్య—ఒక కొడుకును కనటం! తనకు భార్యాలేదు; సంతానమూ లేదు! తనతరువాత యీ అపార ఐశ్వర్యాన్ని అనుభవించేందుకు ఎవరున్నారు ?

తను ముసలివాడైపోయిన సంగతి అప్పుడే గుర్తొచ్చింది. తను ఆస్తిపాస్తులూ ఇవన్నీ తన తరువాత ఏమయ్యేట్టు? ఒక పుత్రవాణ్ని పెంచుకోవాలనే ఉద్దేశం కలిగిందికాని — తన స్వంతంకాని వస్తువుకు ఇంత విలువను ఇవ్వటానికి అతని మనస్సు ఒప్పుకోలేదు. ఐనా తనకు జీవితంలో ఒక కొడుకు ఉండే అవకాశం ఇంకా ఉండనేవుంది. తన వయస్సును గూర్చి అంతగా భయపడ నక్కర్లేదు — ఇంకా షష్ఠిపూర్తన్నా చేసుకోలేదాయె! పోతే తనకు కావలసిందల్లా ఒక భార్య! ఇరానీలాటిదిమాత్రం కాదు. ఎలాంటిదో తనకైతే తెలియదు—ఎందుకంటే తను పెళ్ళి చేసుకుంటేనేకాని భార్యరాదు; భార్య వొస్తేనేకాని ఆమె ఎలాటిదో తెలియదు; వొచ్చినా ఆమె లేచిపొయ్యేటంతవరకూ — ఇరానీలాటిదిమాత్రం కాదని తను నమ్మగలడు—

ఐతే దీనికొక తిరుగుడు ఆలోచించాడు. ఇకానీలాగు కాకుండా, తనకోసం కాకపోయినా తన ఐశ్వర్యానికి కట్టుబడే మనసున్న స్త్రీని తను నమ్మగలడు—

అదృష్టవశాత్తూ ఏనీ అతనికి నచ్చింది. ఆమె బీద కుటుంబంలోనిది. ఆమె తల్లి లండన్‌లో ఒక చిన్న ఇంట్లో చిన్న హోటల్ నడుపుకుంటూ కాలం గడుపుతోంది. ఆఇల్లు కూడా సోమ్స్‌దే—ఎప్పుడైనా ఆ హోటల్‌కు వెళ్ళి ఏనీని చూస్తూండేవాడు. బీదరికంవల్ల ఆమె ఇరవైమూడేళ్ళదైనా ఇంకా కన్యగానే ఉండిపోయింది. బొద్దుగా, గుండ్రని ముఖంతో ఉత్సాహంతో ఉండేది. అంత అందమైనది గాదుకాని, అనాకారి మాత్రం కాదు. ఆమె ఆరోగ్యంచూస్తే సోమ్స్‌కు యీర్ష్య కలిగేది. తనకు తెలియకుండానే చాలాసార్లు ఆ హోటల్‌కు వెళ్ళేవాడు. కొన్నిరోజులనుంచీ ఏనీ తనను ఆకర్షిస్తూందనే సంగతి సోమ్స్‌కు యీ క్షణంలోనే నిశ్చయంగా తెలిసింది.

ఇక ఆలస్యం చేయకూడదని ఆమె తల్లి దగ్గరకు వెళ్ళి ఏనీని తనకు పెళ్ళి చెయ్యమని అడిగాడు. మొదట ఇదంతా వేళాకోళమని ఆమె భావించింది. సోమ్స్ పట్టుదల చూసి ఆమె ఆశ్చర్యపోయింది. భూలోకంలో తన కుమార్తెకు ఇంత గొప్ప సంబంధం దొరుకుతుందని ఆమె కలగనలేదు. సోమ్స్ డబ్బువిషయంలోకూడా ఆశపెట్టి ఏనీని వివాహమాడాడు.

ఏనీ చాలా అమాయకంగా పెరిగింది. అణకువతో తన బీదరిక బాధలోనే జీవితాన్ని గడిపేందుకు అలవాటు పడ్డది.

ఆమె ఎక్కువ ఆలోచించే అవకాశం లేకపోయింది. అందు కనే ఆ అమాయకత్వంలోనే పోమ్స్ భార్యగా, పూర్వం వలెనే జీవితాన్ని గడపసాగింది. పోమ్స్ జీవితాశయంలో దెబ్బతిన లేదు. ఆమె తనకోసమో, తన ఐశ్వర్యంకోసమో కాని కట్టుబడి ఉండిపోయి తన విశ్వాసాన్ని నిరూపించింది.

ఆమె గర్భాన్ని ధరించి నప్పటినుంచీ పోమ్స్ తన భూలోకపు ఆనందాలన్నిటినీ అనుభవించి సంతగా పొంగి పొయ్యాడు. తన పార్సెటీవంశాన్ని ఉద్ధరించేందుకు ఒక కుమారుడు జన్మించబోతున్నాడనే ఊహ కలిగినప్పుడల్లా అతని మనస్సు ఆనందంతో నిండిపోయేది.

కాని యీ ప్రస్తుత పరిస్థితి! నిశ్చయం కోసం వేచి కూర్చున్న యీ భయంకర సమస్య!

ఆపరేషన్ చేయకపోతే—తల్లి జీవించటం కష్టం, ఐతే నేం—తన జీవితాశయం—తన బిడ్డ బతికి బైటపడుతుంది. తనకు కావాల్సింది కుమారుడు కాని—భార్య కాదేమో?

తనకు ఏనీమీద ప్రేమలేకపోలేదు. ఆమె ప్రసవవేదన పడుతూ వుంటే తనకు జాలికలగక పోలేదు. కాని ఆమె కనబోయ్యే శిశువు మృతిపొంది బైటపడు తుంది...ఉత్తరోత్రా ఏనీ గొడ్డుమోతుగానే ఉండిపోవలసి వొస్తుంది. మృతిపొందిన శిశువునుచూసి ఏనీమాత్రం దుఃఖ పడదా? ఆమె మాతృస్థానాన్ని బలిపెట్టేందుకు ఆమె మాత్రం ఇష్టపడుతుందా?

సోమ్స్‌కేమీ తోచకుండా వుంది. జుట్టుపీక్కున్నాడు. చేతుల్తో రొమ్ము బాదుకున్నాడు. తన ఐశ్వర్యమంతా కలిసి తన బిడ్డనో, లేక తన భార్యనో ఏ ఒక్కరినో మాత్రం రక్షించగలదు. ప్రస్తుతం లోకంలో అందుబాటులో వున్న శాస్త్రజ్ఞానంకూడా అంతవరకే ఉపయోగపడుతుంది.

—ముప్పై నిమిషాలూ గడిచినయ్. ముప్పై సంవత్సరాలైనా ఒక నిశ్చయానికి రాలేనేమోనన్నంత భయం సోమ్స్‌కు కలగటంలో ఆశ్చర్యమేమీ లేదు.

డాక్టర్ వొచ్చాడు. సోమ్స్ నిశ్చయంకోసం వేచిఉన్నట్టు చూశాడు.

'పరిస్థితిలో మార్పేమీ లేదు—ఏం చెయ్యమంటారూ?' అన్నాడు. డాక్టర్ తొందరను సూచించే కంఠధ్వనితో.

'సరే—ఆపరేషన్ చేయవొద్దు' సోమ్స్ ఇదే తన నిశ్చితాభిప్రాయమని నమ్మాడు. ఎందుకు నమ్మవలసి వచ్చిందో చెప్పదగ్గన్ని కారణాలు అతనికీ తెలియవు. అతని గుండెల్లో ఒక కుమారుడు—వాడికోసం ఎవర్నయినా త్యాగం చేయవలసిన తన బాధ్యతను గుడ్డిగా నమ్మి ఉంటాడు.

'మీకు బాగా అర్థమయిందా? తల్లి ప్రాణాలమీద ఆశేమీ ఉండదు' అన్నాడు డాక్టర్ ఆశ్చర్యంతో.

సోమ్స్ ముఖంలో పెదవులు తప్ప ఇంకేమీ కదలలేదు.

'ఆపరేషన్ చేస్తే బిడ్డ చనిపోతుందని చెప్పాను కదూ?'

'అవును'

ఆ మెను మళ్ళీ గర్భధారణకు కూడా అవకాశం ఉండదుగా?'

'అందుకనే ఆపరేషన్ చేయవొద్దు'

'ఆ బాధను భరించటం చాలా కష్టం—'

'ఫర్వాలేదు. ఏసీ చాలా ఆరోగ్యంగా పెరిగింది ఆమె బలిష్టురాలు బాధను భరించగలుగుతుంది'

డాక్టర్ ఆశ్చర్యపోయ్యాడు. తను ఏమనుకున్నాడో మానవత్వం అనేది ఏరూపంలో కనిపిస్తుందని తను ఆశించాడో—దాని విరుద్ధరూపాలు చూసేప్పటికి అతనిగొంతు తడి ఆరింది.

'ఏమో—మీ ఇష్టం...ఇది నేనే నిశ్చయించుకోవాల్సి వొస్తే—తప్పకుండా ఆపరేషన్ చేసితీరేవాణ్ని'

డాక్టర్ కోపంతో పైకి వెళ్ళి పోయ్యాడు.

సోమ్స్ బుర్రలో మళ్ళీ ఆలోచనలు తిరగసాగినయ్!

రేపు ఉదయానికల్లా ఏసీ శవాన్ని తన చేతులమీదుగా భూస్థాపన చేయవలసి వుంటుంది. ఆ విధంగా అనుకోవటం రాక్షసత్వమే అవుతుంది. చప్పుడు కాకుండా కిటికీ దగ్గరకు వెళ్ళి బైటికి చూశాడు. ఆ చీకట్లోకూడా ఆకాశంలోని నక్షత్రాలు కాంతివంతంగా మెరుస్తున్నయ్. చలిగాలి వీస్తోంది. ఆకాశమంతా నిశ్చలంగా వుంది...

ఇదే తన ప్రాణమైతే యీ విధంగా ప్రవర్తించేవాడా? ఏమో! ఆమె తన బిడ్డకోసం, తన భర్తనే త్యాగం చేసే

దేమో? లేకుంటే, మాతృప్రేమకు అర్థం వుండదు! ఏనీలాటి బీదదాని దగ్గర్నుంచి తనలాటి పెద్దమనిషి కోరేదేమిటి? ఒక కుమారుడు—ఆమె తనకు ఇవ్వగలిగిన కనీసపు కానుక. లేకుంటే యీ వివాహానికి అర్థమే ఉండదు!

అతి బాధాకరమైన యీతలపు లన్నిటినీ ఇంకో దిక్కుకు తరిమేందుకు ప్రయత్నించాడు. తన ఇంటిలోని అతి విలువైన సామానుల్ని గూర్చి—యీఇంటిలోకి కొత్తగా జననమొందే బిడ్డకోసం కొన్ని ఆటవస్తువులూ, ఇతర సామగ్రినిగూర్చీ ఆలోచించసాగాడు. జీవితంలో ఇప్పుడు తను తీసుకున్నంత రిస్కు ఇదివరకెప్పుడూ తీసుకోలేదు. తీసుకోవలసి వుంటుం దని కూడా తనెప్పుడుకూడా అనుకోలేదు. రేపు అత్తగారు వొచ్చి—తన సంతానాన్ని పొట్టను పెట్టుకున్నందుకు తనను కడిగి పారేస్తుందేమో? ఏఆలోచనల జోలికై పోకూడదను కున్నాడో—అవ్వే తిరిగితిరిగి అతన్ని బాధించసాగినయ్...

ఏమైనా తనలో పురుషత్వం ఇంకా చావలేదు. వజ్ర కాఠిన్యంలాటి దేదో తన హృదయంలో ఉండటంవల్ల తను యీ సమస్యను ఇంత ధైర్యంగా ఎదుర్కో గలిగాడు. ఎన్ని ఆలోచనలు వొచ్చినా తను చలించకూడదు!

కాస్సేపు నిద్రపడితే బాగుండు ననిపించింది. కాని క్షణాలు గడుస్తూన్న కొద్దీ పెరిగే ఆతృత అతని మనశ్శాంతిని దూర దూరాలకు తరిమివేయసాగింది. పురిటి గదిలోంచి ఉండి ఉండి వెలువడే ధ్వనులతో అతను ఒణికిపోతున్నాడు— లోపల ఏమౌతోందో అర్థమైకాదుకాని—ఏదో అశుభం

జరగబోతోందని గట్టిగా తనకు తెలుసుకనుక ! సోమ్, శిలా ప్రతిమవలె అలాగే నిలబడిపొయ్యాడు. కనీసం కూర్చుందా మనన్నా అతనికి తోచలేదు.

పైనుంచి ఒక నర్స్ వొచ్చింది. ఆమె ఫాలభాగంమీద బడలిక, ఎంతో శ్రమపడ్డ చిహ్నాలు స్పష్టంగా కనిపిస్తున్నవి. సోమ్స్ ఒక మూర్ఖుడివలె ఆమెవైపు పరుగెత్తాడు. ఏదో వొక వార్త వింటే కొంత మనశ్శాంతి చిక్కుతుందని అతని ఆశ.

"సార్ ! అంతా పూర్తయింది" అంది నర్స్.

"పూర్తి ? అంటే—సరిగ్గాచెప్పు"

ఆమె ఊపిరి పీల్చుకుంటోంది; ఆ ఆలస్యాన్నికూడా సోమ్స్ భరించలేక పొయ్యాడు.

"చెప్పు—త్వరగా !"

"బిడ్డా తల్లీకూడా బతికే ఉన్నారు" అందామె.

సోమ్స్‌లో యీవార్త వెంటనే చలనాన్ని కలిగించలేక పోయింది; ఎందుకంటే యీ శుభవార్తకోసం అతను వేచి కూర్చోలేదు. నాలుగైదు క్షణాలు గడిచాక కాని అతను విన్నమాటల అర్థం తెలియలేదు.

ఇప్పుడు సోమ్స్ ఆనందానికి మేరలేదు. కఠిన విధిని యీ రిస్క్‌తో ఎదుర్కొన్నాడు. ఒక వీరపురుషుడివలె నిలబడ గలిగాడు; తను భయపడలేదు. ఆవిధిని లెక్కచేయలేదు, అందుకనే తన కీవిజయం...ఆవిధి ముఖంలో నవ్వినంత సంతోషమైంది—

ఆ ఆనందంతో సోమ్స్‌కు నాట్యం చేయాలనిపించింది. తనకు భార్యో, కుమారుడో కాదు—ఇద్దరూ దక్కారు. తన జీవితమే ధన్యమైంది!

డాక్టర్ నిట్టూర్చాడు.

"నేను మిమ్మల్ని అభినందిస్తున్నాను. మీ ధైర్యానికి మెచ్చి ఆ విధి ఇద్దర్నీ రక్షించాడు. చాలా అదృష్టం! బిడ్డే కనుక మగవాడైనట్టయితే తల్లి యీపాటికి స్మశానంలో ఉండవలసింది" అన్నాడు డాక్టర్.

"ఏమిటీ—ఆడబిడ్డా?"

"ఔను... మొగబిడ్డ కాదుకనుకనే అదృష్టవంతురాలివి!"

సోమ్స్ కొయ్యబారి పోయ్యాడు. క్షణంలో అతనిముఖం నల్లబడ్డది. తన తలమీది బరువంతా దిగిపోయిందనే ఆనందంలో ఉండగా, అంతకన్నా పెద్దబరువు నెత్తినపడ్డది. ఒక కుమార్తెకోసమైతే తనుయీవిధంగా రాక్షసుడల్లే ప్రవర్తించే వాడుకాదు. విధితోడి యీపోరాటానికి దిగేవాడుకాదు...

సోమ్స్ చాలాసేపటివరకూ అలాగే కొయ్యబారి, ఎదురుగుండా వున్న ఫార్సైటీకుటుంబపు ఫోటోనుచూస్తూ నిలబడి పొయ్యాడు.

గాల్స్‌వర్దీ అనుసరణ.

—సెప్టెంబర్, 1947

# సమస్య!

పక్కింటివాళ్ళకు గ్రామఫోను ఉండటం నాకు ప్రాణాంతకమైంది. రాత్రి సరిగ్గా ఎనిమిది మొదలు పదకొండింపావుదాకా గ్రామఫోను పెట్టటం వాళ్ళకో దైనందిన కార్యక్రమం; అది వింటూండటం మాకో ఆచారంగా మారింది. వాళ్ళింట్లో పిల్లలెక్కువ. సైజువారీగా ఉండటంవల్ల—నిద్రపోయేవాళ్ళు నిద్రపోతూవుంటే గ్రామఫోనుచేత పాడించేవాళ్ళు ఆ పనిలో ఉండేవారు. ఒక్కసారన్నా పొరపాటునన్నా మరిచిపోయి ఊరుకుంటారేమోనని చూస్తే యీ రెండునెలల్లోనూ అదెప్పుడూ జరగలేదు.

నాకు నిద్రాభంగంగా వుందని కానీ, ఆ పరిసర ప్రాంతాలకు న్యూసెన్స్‌గా వుందనికానీ నేను ఫిర్యాదుచేయను. ఎందుకంటే అది చక్కని సంగీతం. దాన్ని విని ఆనందిస్తూండగా దాన్ని న్యూసెన్స్ అని ఎలా అనగలనూ? నాలాగే అది వినబడినంతవరకూ మిగతా జనంకూడా ఆనందిస్తూ వుండివుంటారనేది నా గాఢనమ్మకం.

యీ గ్రామఫోనుకు అలవాటైపోయ్యాను. ఎప్పుడన్నా గ్రామఫోను వెయ్యటం కాస్త ఆలస్యమైతే జీవితంలో పెద్ద లోపం జరిగినంతగా బాధపడేవాణ్ని. అందుకని నేను నిజంగా ఆనందిస్తున్నాననే అనవలసివుంటుంది,

ఎప్పుడన్నా వినుగ్గావుండి గ్రామఫోను మోగటం మొదలెట్టగానే న్యూసెన్స్ అనిపించేది. రోజూ వినేపాటల్నే తిరిగి యీనాడు వినటమంటే (అందులోనూ మనస్సు బాగా లేనప్పుడు!) ఇష్టంలేని పెద్దబరువేదో తలమీద పడ్డట్టు తోచేది. కాని మధురమైన సంగీతాన్ని అనుభవించలేని వాడు కళాభిమాని కాదనే సంగతి వెంటనే గుర్తుకొచ్చి నా మనస్సునే తిట్టుకునేవాణ్ని. క్రమంగా ఆ సంగీతంమీద మనస్సును లగ్నంచేసేవాణ్ని. అప్పుడు మనస్సుకూడా నాకు తెలియకుండానే దానంతట అదే తేలికయ్యేది. అంటే ఆ రికార్డులు నా చెవుల్లోని తుప్పును వొదలకొట్టటమే కాకుండా విరిగిన లేక విరిగేందుకు సిద్ధంగావున్న మనస్సును తేలిగ్గా అతికించిపారేసేది! అలాంటిదాన్ని దూషించటమంటే నాకు ఇష్టంలేనిపనే!

వాళ్ళు విడుదలైన కొత్తరికార్డులన్నీ కొనేవాళ్ళు. అప్పుడు నాకు మహదానందంగా ఉండేది. దైనందినచర్యలో కూడా కాస్త మార్పు ఉంటూండటంవల్ల 'రిలీఫ్' కూడా దొరికేది. మా యిష్టప్రకారం వాళ్లు కొనకపోయినా, వాళ్ళు కొన్న వాటిల్లో కొన్నిటిమీదన్నా నాకు ఇష్టముండేది.

ఇంతవరకూ అంతా బాగానేవుంది. కాని అసలు వొచ్చి పడ్డ ప్రమాదమంతా నేను రోజూ విని ఆనందించే ఈ గ్రామ ఫోనువల్లనే...

నా భార్య కాపరానికివొచ్చిన కొత్తల్లో గ్రామఫోను అంటే తనకెంతో మోజువున్నట్టు సూచించేది. పుట్టింట్లో తమకు గ్రామఫోనుఉండి దానికి అలవాటుపడ్డ జీవం కాక పోయినా, అత్తవారింటన్నా తనకోరికను తీర్చుకోవాలని ఆమె ఆశయం ఐవుంటుంది. పెళ్ళిసంబంధం కోసమని ఆమె కొన్నాళ్లు హార్మోనియంపెట్టె ముందేసుకొని కసరత్ చేసిన మాటమాత్రం నిజం. అప్పుడేదో 'కుంయ్!' 'కుంయ్!' మనిపించేది. కాని మూడుముళ్ళూ పడి తను నేర్చుకున్న సంగీతపు అవసరం తీరగానే—హార్మోనియం పెట్టెకు బూజు పట్టటం ప్రారంభించింది.

ఐతేనేమాత్రమేం-ఆమె కళాభిమాని. ఆ కళను కొన్నాళ్ళ పాటు ఆరాధించిన నేరానికిగాను శిక్ష ఏమిటంటే-ప్రస్తుతం తను సంగీతకళనుఆరాధించలేకపోయినా—ఆ కళమీది అభి మానాన్నిమాత్రం చంపుకోలేకపోయింది. క్రమంగా ఆ అభి మానాన్ని వయస్సుతో పాటే వృద్ధిచేసుకో సాగిందనికూడా నాకు అర్థమైంది. సంగీతాన్ని సాధనచెయ్యని వాళ్ళక్కూడా—సంగీతమంటే ఎంతోఇష్టం ఉండిఉండొచ్చు కాని—సంగీ తాన్ని కొన్నాళ్ళు సాధనచేసినవాళ్ళకు మాత్రం అంతకన్న ఎక్కువ అభిమానం ఉండటం అతి సహజం. ప్రస్తుతపరి స్థితుల్లో కాలం కలిసి రాకపోవటంవల్ల ఇక ఆ కళను అవస రంలొద్దీ నిరుత్సాహపడి సాధించలేక పోవటంవల్ల—ఆమె ఆ కళను ఆరాధించే వ్యక్తులమీద తన అభిమానాన్ని

సారించింది. అప్పుడప్పుడు తన సంగీతజ్ఞానాన్ని ఏ సినిమా పాటల రూపంలోనో, ఏ సావిత్రీగారి దేని పాటలరూపంలోనో కూనిరాగాల్లోనే పరీక్షించుకునేది. తనపాట ఇతరులకు విని పించగలిగే స్థితిలో మాత్రం లేదన్న సంగతి ఆమెకు తెలి యటం నా అదృష్టంలో నొకటి. అప్రయత్నంగా చాటుగా ఎప్పు డన్నా నేనామె కూనిరాగాల్ని వినటం సంభవించేది. అసలు విననట్టే ఊరుకునేవాణ్ని. ఎందుకంటే నేను విన్నట్టు బైట పడేపక్షంలో ఆమెను పొగడవలసివస్తుంది. నాకు ఇష్టం లేక పోయినా ఆమెను సంతోష పెట్టేందుకుగాను కాస్త పెద్దగా పాడమని ఆమెను మొదట్లో బతిమాలాల్సి వొచ్చేది. అప్పుడు ఆమె పాడుతుంది; దానికి తాళంగా నేను బుర్రతిప్పుతూ 'ఓహో!' అనవలసిన అవసరంకూడా ఏర్పడేది. ఇదంతా ఆమె అభిమానాన్ని సంపాయించేందుకు పడే అవస్థగా తయారయేది. ఇదంతా ముందుగా తెలివిగా ఊహించుకునే మామూలుగా ఊరుకునేవాణ్ణి. నన్ను చూసి తను సిగ్గుపడుతూ పాడే కూనిరాగాన్ని ఆపేసి నన్నొక విధంగా ఆమె రక్షించే దనికూడా చెప్పవచ్చు.

ఐతే తన కళాభిరుచిని ప్రదర్శించేందుకు ఆమె గానసభ లకు వెళ్ళేదికాదు. ఇతర పాటకత్తెల దగ్గరకు వెళ్ళి పాటలు విని ఆనందించేదికూడా కాదు. ఆమెకల్లా కావాల్సింది తన ఇష్టంవొచ్చినన్నిసార్లు పాటలుపాడే యంత్రం. తనకు సంగీ తంలో వినుగుపుట్టేట్టు, అలసిపొయ్యేట్టు చెయ్యగలిగే మృదు మధుర సంగీతం!

ఆమె కోరిక నాక్కూడా బాగా నచ్చింది. గ్రామఫోను ఇంట్లో ఉండటం ఎవరికి చేదూ? వీలుంటే బోడి గ్రామఫోనేమిటి—రేడియో ఉండటమే నాకు ఇష్టం. కాని గ్రామఫోను కొనేందుకు సరిపడేటంత ఆదాయం నాకు లేదు. పోనీ ఏలాగైనా కొంటేసరా? నా సంపాదనను తినేందుకు రికార్డులే చాలు. దాన్ని మేపేసామర్థ్యం నా దగ్గర లేక—అసలు సంగతి బైటపెట్టకుండా తెలివిగా డొంకతిరుగుడుగా కుంటి గుడ్డి సమాధానాలతో ఆమెను ఎలాగో ఊరుకోపెడుతూ వొచ్చాను. నానాఅవస్థలూపడి ఆమె యీ గ్రామఫోను గొడవ మరిచిపొయ్యేట్టుకూడా చెయ్యగలిగాను.

ఆ గాయంమాని సంవత్సరం తిరక్కుండానే మా పక్కింటి ఆఫీసరుగారి ఫోను మళ్ళీ ఆ పాతగాయాన్ని కెలికింది.

వాళ్ళు గ్రామఫోను వెయ్యటం మొదలెట్టగానే కళకళలాడే ఆమెముఖం వెలవెలబొయ్యేది. కార్యక్రమం సాగుతూన్నకొద్దీ ఆమెముఖం ముడుచుకునేది. ఆ కోపంలో ఆమె ముఖం ఎంతో ముద్దుగా ఉన్నట్టు నాకు కనిపించేదికాని ఆ వేడిలో ఆమెను తాకేందుకే నాకు ధైర్యం చాలేదికాదు. ఆమె తన కోరికను బైటపెట్టేదికాదు; ఎందుకంటే కొన్నాళ్లు పట్టుపట్టి లేదనిపించుకొన్నది. ఆ దెబ్బతాలూకు అభిమానం ఆమెనోటిని కట్టేసి, తన పట్టుదలను ఒక విధంగా మరింత బలపరిచింది.

—కాని ఆమె ఒక్కమాటన్నా మాట్లాడకపోయినా, ఆమె ఉద్దేశం ఏమిటో నాకు బాగా తెలుసు. తీగ కదిలిస్తే కంప మొత్తం లేస్తుందేమోననే భయంతో నేను ఇదేమీ గమనించనట్టుగానే నటించేందుకు ప్రయత్నించేవాణ్ని. ఆమె తనంతట తానుగా బైటపడి తీరాల్సిన అవసరాన్ని సృష్టించదలిచాను. తన సూచనలు నామీద పనిచెయ్య లేదని బాగా అర్థంచేసుకున్నాకన్నా ఆమె తన హృదయాన్ని బైటపెట్టక తప్పదు. ఆమె మాట్లాడటంలోనే నాకెంతో రక్షణవుంది. ఎందుకంటే—ఆమె నిజంగా బాధపడని విషయంలోకూడా బాధపడుతోందేమోనని నేను అనవసరపు ఆలోచనను చేయవొచ్చు. ఇంకో తిరుగుడు ఏమిటంటే—ఆమె చెప్పదల్చుకున్నదాంట్లో సగంకన్నా ఎక్కువ బైటపెట్టలేదు. అదీ తను లోపల అనుకున్నంత ఘాటుగాకూడా చెప్పలేదు. తన కోరిక తీరుతుందో లేదోనన్న అనుమానమే ఆమెను బాగా నిరుత్సాహ పరుస్తుంది. నేను ఓపికపట్టి ఆమె తన ఓర్పును కోల్పొయ్యేట్టు చేస్తే సరిపోతుంది. అందాకా యీ మూకీచిత్రంలోని బాధ భరించక తప్పదు.

వారం తిరక్కముందే మరి భరించలేక నేనే ఓడిపోవాల్సి వొచ్చింది. దాంపత్యంలో ఏ ఒక్కరు కర్ర బుర్రమన్నా దానిమజా కాస్తా పోతుంది కనుక, సాధ్యమైనంత త్వరలో విషయాల్ని పరిష్కారం చేసుకోక తప్పదామె!

"ఏమిటీ—అన్యమనస్కంగా ఉంటున్నట్టున్నావ్ ?" అన్నాను విధిలేక.

నాచేత అడిగించుకోవాలనే ఆమె కాచుకొనివుంది—వెంటనే "మనకూ్కడా గ్రామఫోను కొనరూ ?" అంది బతిమాలుతూన్నట్టు.

ఆమె కంఠధ్వని నన్ను కరిగించింది కాని, బరువులేని పర్స్ బెదిరించింది. ఏదోవిధంగా కారణాలు చెప్పి ఆమెను తృప్తిపరిచేందుకు ప్రయత్నించసాగాను.

"మనకు లేకపోతే మాత్రమేం ? మన పక్కింటివాళ్ళకు వుంది. ప్రతిరాత్రీ విడవకుండా వాళ్ళు ఆ సంగీత కార్యక్రమాన్ని సాగిస్తూనేవున్నారు. మనకు దమ్మిడీ ఖర్చు లేకుండా, కీఇచ్చి రికార్డు మారుస్తూ, పిన్నుమార్చే శ్రమ యేమీ లేకుండానే చక్కని సంగీతాన్ని మన కర్ణపుటాల్లోకి ఉచితంగా పంపి ఎంతో పరోపకారాన్ని చేస్తూన్న మన ఇరుగువాళ్ళు ఉంటే—!"

"వాళ్ళకు వుంటే మనకేం వొరిగిందీ ? వాళ్ళు తింటే మనకు కడుపు నిండుతుందా ?" అందామె.

ఆమె వాదనలో ఎక్కడ పొరపాటు పడ్డదో తెలివిగల నాకు అర్థంకాకపోలేదు.

"వాళ్ళు తినే దానికీ మనకు కడుపు నిండేందుకూ సంబంధంలేదు. ఎందుకంటే వాళ్ళ నోటిగుండా ప్రవేశించే భోజనం వాళ్ళ కడుపుల్నే నింపుతుంది. కాని శబ్దానికి అలాంటిదేమీ

ప్రకృతి శాసించకపోవటం మన అదృష్టం. వాళ్ళు అనుభ వించే సంగీతం వాళ్ళ చెవుల్లోనే కాకుండా మన చెవుల్లో కూడా దూరి మనను ఆనంద పరుస్తుంది. గ్రామఫోను వుండ టంవల్ల మనకు కలిగే యీ ఆనందం, అది లేకుండానే కలుగుతోంది కదా ?''

నా వాదనను ఆమె అర్థం చేసుకుంది, సకారణంగా ఉండ టంవల్లా, తన వాదన ఓడిపోవటంవల్లా ఆమె అభిమానం మరింత దెబ్బ తిన్నది.

కోపాన్ని నటిస్తూ (?) ఆమె అంది: ''పోనీండి...వాళ్ళకూ వాళ్ళకూ వుందని తృప్తి పడటంలో అర్థంలేదు—''

''ఉన్నప్పటినుంచీ రికార్డులూ అవీ ఇవీ కొనటానికీ డబ్బు చాలదు. అదీకాక ఇంకెవరన్నా ఎరువు అడగొచ్చు. ఇవ్వననటానికి మొహం మాట మాయె! ఇచ్చినప్పటినుంచీ– పరాయి వస్తువు కనుక దాన్ని అజాగ్రత్తగా వాడి పాడు చేశారంటే మనం ఏమనేందుకూ వీల్లేదు; దాన్ని మళ్ళీ మరామ్మత్ చేయించుకోవాల్సిన బాధ్యత కూడా మనమీద పడుతుంది... తెలిసిందా ?''

''అబ్బో! మహా ఎరువిస్తున్నారు లెండి! ఇంతవరకూ మనం ఒకళ్ళను ఎరువు అడిగాచూ ?''

''అడగలేదు. ఎందుకంటే మనం ఎరిగివున్న వాళ్ళందరికీ గ్రామఫోను లేదు కనుక; ఉన్నవాళ్ళను అడుగుతే ఏమను కుంటారోనని ఒకవిధంగా భయపడి, ఐతే ఇదివరకు అడగ

లేదని ఇప్పుడు కానీ, ఇక ముందు కానీ, అనుగ మనసే గ్యారంటీ యేమీలేదు. ఉదాహరణకు-నీకంత సరదాగా వుంది కనుక, పక్కింటివారిని అడిగో లేక నా స్నేహితుల్లో ఎవరినన్నా అడిగన్నా ఎరువు అడిగి గ్రామఫోను తీసుకొస్తాను. నాలుగు రోజుల పాటు మనస్వాంతమే అన్నట్లు ఉపయోగించుకోని. ఆమోజు తీరగానే పంపేస్తేసరిపోతుంది...''

''ఎందుకొచ్చిన మాటలండీ-ఇతరుల వస్తువుల్ని ఉపయోగించటమంటే నాకు మహా మంట!—'' అంది.

ఆమెకుకలిగే యీామంట, నాకు మాత్రం 'ఖర్మం!' గానే కనిపించింది.

నిరాశతో బాధపడుతూన్నట్టు కాస్త ఆగిఅంది; ''అంతకన్న 'కొనటం నాకు ఇష్టంలేదు' అని ఒక్కమాట అనేస్తే సరిపోతుందిగా!''

''ఇష్టంలేకపోవట మేంఖర్మం? పక్కింటివాళ్ళకు ఉన్నలాటి రెండంతస్తులమేడ వొకటీ, రేడియో వొకటీ, మనకూ, ఉత్తరోత్రా మనకు కలగబొయ్యే సంతానానికీ సరిపొయ్యే పెద్దఫోర్డుకారువొకటీ — ఇంకా ఇలాటివే అనేకం కొనాలని నాకు మహాయిష్టం! ఐతే ఏంలాభం? ఇష్టంఉండగానే సరా? కోర్కెలుతీరే అవకాశం లేనప్పుడు, వాటిని ఆకాశంఎత్తున పెంచుకోవటం అనవసరం. అసలు కావాల్సింది తింగురంగడు!''

“నా ఆశలన్నీ ఆకాశంఎత్తున ఉన్నవా? నేను కొన్లా క్షమానాలూ లేనని ఏడ్చానా? వెధవ గ్రామఫోను కొనుక్కో- నేప్పుడేనా మీ బీకరికాన్ని బైటపెట్టుకునేది? మీయిష్టాలు తీర్చుకునేందుకు వాచ్చేడబ్బు-ఇద్దరి ఇష్టాల్నీ తీర్చేందుకు రాకాలేంది—!”

ఇది జవాబుల్లోనూ; సకారణవాదనలలోనూ తేల్చేస్థితి దాటిపోయిందని తోచి, నేనేమీ మాట్లాడలేదు. ఆనాటి నుంచీ ఆమె ముభావంగా, ఎడమొగం పెడమొగంగా ఉంటూవొచ్చింది. ఆమె స్థితిచూస్తే గృహిణిగా తోచటం లేదు; తన పనిమాత్రం చేసుకుపొయ్యే యంత్రం అని పిస్తోంది.

నేను ఇదంతా కనిపెడుతూనే వున్నాను. వెధవగ్రామ ఫోను మా ఇద్దరిమధ్యా యీ అగాధాన్ని సృష్టించింది. గ్రామఫోను అత్యవసరమైన వస్తువుకూడా కాదు; భోగలాల సకు పనికివొచ్చే యంత్రం! పక్కింటివాళ్ళు గ్రామఫోను వెయ్యటం మానేసినా గుడ్డిలో మెల్లగా ఉండేది. వాళ్ళు మామూలుప్రకారం దాన్ని మోగించి, మాఇద్దరిహృదయాల్నీ కెలుకుతూనేవున్నారు. వాళ్ళను అభ్యంతరపెట్టేందుకానీ, బలిమాలి ఆపించేందుకానీ నాకేమీ హక్కు లేదు. ప్రతిరోజూ విడవకుండా మాకా పాతసంగతులన్నీ గ్రామఫోనుద్వారా జ్ఞాపకంచేస్తూండటంవల్ల వాళ్ళంటే నాకు యీర్ష్యకూడా కలిగింది. మా లేనితనాన్ని పనికట్టుకొని

ఏగతాళిచేస్తున్నా రనిపించేది. వాళ్ళమీద కలిగే చేతకాని కోపం నన్ను మరింత బాధ పెట్టసాగింది.

నా భార్యలో వాళ్ళ గ్రామఫోను ఏఫీలింగ్సైతే ప్రవేశ పెట్టి గ్రామఫోను కొనేందుకు మొండి పట్టు పట్టేందుకు సహాయ పడిందో నాలో కూడా అలాంటి ఫీలింగ్సే పనిచేయ సాగినవి. గ్రామఫోను కొంటే మాలేనితనం కప్పుకుపో తుంది; అటు నాభార్య కూడా సంతోషిస్తుంది. మా ఇద్దరి మధ్యా అపార్థాలేమీ ఉండవు. జీవితానికి ఒకరకమైనతృప్తి కూడా వుంటుంది. యీ బోడి సమస్య ఇంతతో విరగడై పోతుంది.

కొనాలని నిశ్చయించుకోగానే నాలోకి కొత్తశక్తి ప్రవే శించింది; ఆశక్తి మహాత్మ్యంవల్ల గ్రామఫోను కొనటం నా తలకు మించిన పనైనా—ఏదో విధంగా తంటాలు పడి కొనేట్టు చేసింది. ఐతే ఆనిశ్చయాన్ని నాభార్యకు చెప్ప లేదు. ఆమెకు తెలియకుండా ఆకాత్తుగా ఫోను తీసుకువెళ్తే ఆమె ఆనందం ద్విగుణీకృతమౌతుందని నా నమ్మకం.

గ్రామఫోను చూడగానే "ఎక్కడిదీ? ఎవర్నన్నా ఎరు వడిగి తెచ్చారాయేం?" అందామె.

కరకు రూపాయిలు పోసికొన్న వస్తువును ఇలా చిన్న చూపు చూసేప్పటికి నామనస్సు చివుక్కుమంది. లోగడ నేను కొద్దికాలం పాటు ఎవరి పోనన్నా ఎరువు తెచ్చి మన సరదా తీర్చుకుందామనే ఉద్దేశాన్ని కనపరిచి ఉండటంవల్ల

ఆమె యీవిధంగా అపోహ పడి వుంటుందని తెలుసు కున్నాను.

"ఇంత కొత్తది యీపాతిక రికార్డుల్తోపాటు ఎవరన్నా ఎరువిస్తారా? యీబిల్లు చూశాక నా్నా నీఅనుమానం పోతుందా?" అని అమ్మకపు పన్నుతో సహా రాయబడ్డబిల్లును ఆమెచేతి కిచ్చాను.

ఆమె అనుమానాలన్నీ పటాపంచలైనవి. ఆమె ఎంతో సంతోషపడ్డది; భూలోకంలో తనకు తీరవలసిన కోర్కెలన్నీ తీరినంతగా ఆనందపడ్డది. సెకండ్ హాండ్ కొని సరిపెడదామా అన్న నాఉద్దేశాన్ని చంపుకోకపోయినట్టయితే నాసమస్య సగమే తీరేది...ఆనాటిభోజనం విషయంలోనూ ఆమెఎంతో శ్రద్ధచూపిందని వేరే చెప్పనక్కర్లేదు.

యీ ఫోను రాకపూర్వం ఆమె పని కట్టుకొని పక్కింటి వారి స్నేహాన్ని సంపాయించింది. గ్రామఫోను అనేది ఏదేవతలకో లభ్యమయ్యే అమృతంలాటి వస్తువని ఆమె అమాయకంగా నమ్మి వుంటుంది. పక్కింటివారిమీద ఆమెమాటల సందర్భంలో ఇచ్చే సదభిప్రాయాలూ, వారంటే తనకున్న గౌరవాన్ని సూచించేమాటలూ విని నేనిది గ్రహించాను. రోజూ వాళ్ళింటికివెళ్ళి వాళ్ళఫోనును తాకి కొంతవరకూ తృప్తిపడేదని నాఅనుమానం. తన జీవితానికి తీరనికోరికగా కనిపించిన ఆ ఫోనుకు ఆమె అలాటి విలువను అంటగట్టటంలో అసహజమేమీ లేదు. ఇంకోరిఫోనును, వారి అను

మతిమీద తాకాల్సిన అవసరం ఆమెకు లేదు. యీకొత్త ఫోనును ఆమె పక్కలో కూడా పెట్టుకొని నిద్రించగలదు!...ఆ సంతోషంలో ఆమె భోజనంకూడా సరిగా చేయలేదు.

యీ ఫోనును ఇంట్లో దింపి నప్పటినుంచీ నన్నో పెద్ద అనుమానం వెంటాడుతోంది. ఇప్పుడు పక్కింటివారికీ మాకూ కూడా ఫోను ఉండటంవల్ల ఒకరికొకరు పోటీగా మారాం. ఇద్దరమూ ఒకేసారి ఫోను వెయ్యటం మొదలు పెడితే ఎవరూ ఆనందించలేరు. వాళ్ళది పాతమేళాం కనుక ఊరుకోగలుగుతారేమో కాని, మాది కొత్త బులపాటం కనుక దాన్ని మోగించందే నిద్రపట్టదు...ఎట్లా?

వాళ్ళ కార్యక్రమం పూర్తయ్యాక మేం మొదలుపెట్టడమంటే—అర్ధరాత్రివేళ అంకమ్మ శివాలే అవుతుంది. అసలు నా ఉద్దేశంకూడా మాక్కూడా ఫోను వుందనీ, వాళ్ళకన్నా మేమేమీ తక్కువ తినలేదనీ తెలియజెప్పాలి. పోయి యీ సువార్తను వాళ్ళకు అందివ్వటంకన్నా రికార్డు మోగటం మొదలెడితే వాళ్ళే గ్రహిస్తారు. క్రొత్తఫోను ఎదురుగుండా వుంటే దాన్ని ఉపయోగించటానికి ఏ మాత్రం ఆలస్యం చేసేందుకూ నా మనస్సు అంగీకరించటంలేదు. అందుకనే వాళ్ళకన్నా నేనే ముందుగా గ్రామఫోను వెయ్యటం మొదలు పెడితే వాళ్ళు విధిగా ఆపుకోక తప్పదు. సభ్యత తెలిసిన ఎవరికైనా ఇది తప్పదు. ముందుగా నేను మొదలు పెట్టాను కనుక—నా మీద పోటీకి వొచ్చేటంత నీచాభిప్రాయం తమలో లేదని నిరూపించేందుకైనా వారికిది తప్పదు.

నేను వాళ్ళమీద యీ విధంగా కాలుదువ్వేందుకు గొప్ప కారణం ఒకటి వుంది. నాకు గ్రామఫోను లేనందువల్ల నేనది కొనలేదు; కాని వాళ్ళకు ఉన్నందువల్ల నేను కొనితీరవలసిన పరిస్థితి ఏర్పడ్డది. అంటే నాచేత వాళ్ళు అనవసరంగా గ్రామఫోనును కొనిపించారన్న మాట! ఆ కసిని తీర్చుకునేందు కన్నా వాళ్ళను దమ్మెత్తనీయ కూడదని నిశ్చయించుకున్నాను.

ఏడుగంటల నుంచే గ్రామఫోను వెయ్యటం మొదలెట్టాను......నా ఎత్తు ఫలించిందనే చెప్పాలి. మామూలు వేళకు వాళ్ళు మొదలుపెట్టలేదు. యీ సంగతి కనిపెట్టగానే—ఎంతో ఓపిగ్గా కూర్చొని, రికార్డుకూ రికార్డుకూ మధ్య కాలయాపన లేకుండా సమర్థించాను. ఏమాత్రం ఆలస్యం చేసినా మా కార్యక్రమం పూర్తయిందని వాళ్ళు మొదలు పెడతారేమోననే భయమే నా చేత ఇంత పనీ చేయించింది...కాని వెధవ పాతిక రికార్డులు ఎంతసేపని వస్తవి? అందుకని, కొత్త మోజుతో వేసినవాటినే తిరిగి వేస్తూ అర్ధరాత్రి వరకూ గడిపాను.

మర్నాడు సాయంత్రం నేను ఇంటికి వొచ్చేప్పటికే గ్రామఫోను పనిచేస్తూవుంది. మా ఆవిడ వీధిలోని ఆడవాళ్ళనూ—ముఖ్యంగా పక్కింటివారి స్త్రీ జనాన్నీ పిల్లల్నీ తీసుకొచ్చి పెద్దసభ చేసి వాళ్ళకు గ్రామఫోను వినిపిస్తోంది. నన్ను చూడగానే వాళ్ళంతా వెళ్ళిపోయ్యారు. వాళ్ళందరి ముఖాల్లోనూ

యీార్ష్య స్పష్టంగా కనిపిస్తూండటంవల్ల నాకూ పరమానందమైంది.

'పక్కింటి వారు ఏమన్నారూ?' అన్నాను మాఆవిడతో, వీధిలో వాళ్ళ అభిప్రాయాలన్నీ వాక ఎత్తూ, పక్కింటి వారి (మా పోటీ దారులు!) అభిప్రాయం ఒక ఎత్తూను.

"వాళ్ళెంతో మెచ్చుకున్నారు. తమ ఫోను కన్న మనది ఎంతో మంచి దన్నారు. వాళ్ళది ఇక్ష్వాకుల నాటి మోడల్ట...!"

ఇదంతా నాకు శ్రవణోపేతంగానే వుంది. ఇకముందు పక్కింటివారు మా ఫోనును చేతితో తాకి ఆనందించవలసిన అవసరానికి గురవుతారని నా నమ్మకం! వాళ్ళదానికన్నా మాకు ఎంతో మంచి ఫోనుఉండటమూ, ఆ సంగతి వాళ్ళకు బాగా తెలియటమూ కన్న—వాళ్ళకు కావలసిన గర్వభంగం ఇంకేముందీ! వాళ్ళకన్న మే మేమీా తీసిపోం—కాక పోతే గ్రామఫోన్ కొనటంలో చాలా ఆలస్యమైంది; ఐతే మాత్రమేం—ఆవార మా ఫోన్ చాలామంచిది, కొత్తది కనుక చాలాకాలం వరకూ మరమ్మతులు లేకుండానే పని చేస్తుంది.

"కాని..."అని మా ఆవిడ ఆగింది.

మళ్ళీ ఏదో అవాంతరం వొచ్చిపడ్డదని "కాని?..."అని ఆమెను రెట్టించి తొందర పెట్టాను.

"రికార్డులు ఇవ్వేనా అని అంది."

నాకు ఛ్రమంది. కొన్ని సంవత్సరాలుగా వాళ్ళు అప్పుడుకాసినీ అప్పుడు కాసినీ రికార్డులు కొంటూండటంవల్ల అవన్నీ యీ నాటికి మూడు బీరువాలకు సరిపడే అన్ని అయినవి. అంతే కాని, వారవన్నీ ఒకేసారి కొనలేదు. ఆ పని ఎవ్వరూ చెయ్యరు; చెయ్యలేరుకూడాను. కొత్తవి వస్తూండగా ఉన్నవాటి సంఖ్యను పెంచుకునేందుకు సాధ్యం కాని— ఇంకా రానివాటిని ఎవరు ఏవిధంగా కొనగలుగుతారూ? ఒకేసారి అన్నీ కొనటమంటే బోలెడు డబ్బుకూడా కావాలి. ఒకదాని తరువాత మరో రికార్డుకొని ఒక్కోటే పాతపడే అవకాశాన్ని చూసుకోవాలి కాని, ఒక్కసారి ఒక వాగన్ కొంటే మొహం మొత్తిపోదూ?... ఏమైనా యీ విషయంలో మాత్రం చిన్నరిమార్కు రావాల్సిన అవకాశాన్ని ఎందుకు ఇవ్వాలి? క్రమంగా కొనే బదులు—రేపే ఇంకో పాతిక రికార్డులుకొంటే—తరువాత చూసుకోవచ్చు. ఆ దెబ్బతో వాళ్ళు సగం ఛస్తారు!

''సరే—రేపే మరికొన్ని రికార్డులు కొంటాలే'' అన్నాను తప్పనిసరై. గ్రామఫోను కొన్నాక; రికార్డులు ఎవడికోసం కొనాలి!

ఆమె ముఖం వికసించింది. సన్నింతో ప్రేమగా లాలనగా చూసింది. 'యీ దెబ్బతో పక్కింటివారికి మన తడాఖా అంతుపట్టి తీరుతుందనే నమ్మకం నాకు కలిగింది.

గత రాత్రిలాగే ఆ రాత్రికూడా ఏడుగంటలకే ఫోను చెయ్యటం మొదలు పెట్టాను. చాలా సేపటివరకూ పక్కింటి వారి ఫోను మోగుతుందేమోనని అనుమానం నన్ను వేధించింది కాని, ఆ చప్పుడేమీ కానరాలేదు. మనస్సు ఎంతో తేలిగ్గావుంది.

మర్నాడు అప్పుచేసి ఇంకో పాతిక రికార్డులు దింపాను, ప్రతిరాత్రీ గానసభా కాలక్షేపం తప్పనిసరిగా ఉండితీరాలనే నిశ్చయానికి వొచ్చాను.

అనుకున్న దానికి భిన్నం లేకుండా జరిగిపోతూనే వుంది, నెలరోజులపాటు విడవకుండా ప్రతిరోజూ నాలుగైదు గంటల సేపు ఫోను వింటూంటే (అందులో ఆ పాత రికార్డులే! కొత్తవి ఇంకోవకస కొందామంటే అప్పుదారికే మార్గం కూడా కనిపించటంలేదు) దానిమీది మోజు మా ఇద్దరికీ తగ్గిపోయింది. ఆమె 'పోనిద్దురూ—ఇప్పుడేం ఫోను!' అని నాలుగైదుసార్లన్నా పట్టుదలకోసం, మాకోసం కాకపోయినా పక్కింటివారి కోసం నేనుమాత్రం ఓపిగ్గా ఫోను వేస్తూనే ఉన్నాను. వాళ్ళకన్నా ఒకగంట ముందుగా మొదలయ్యే మా కార్యక్రమంలాగే, వారుకూడా మాకన్న ఒకగంట ముందుగా కార్యక్రమాన్ని మొదలుపెట్టకపోవటం (ఆఉద్దేశం ఉపాయం వాళ్ళకు తట్టలేదని నా నమ్మకం) ఒక అదృష్టం! ఆ భయంతోనే యంత్రంలాగు ఆ యంత్రాన్ని పనిచేయించటంలో నే నెప్పుడూ అశ్రద్ధచూపలేదు. ఆఫోను మరీ ఎదుర

కుండా కనిపిస్తూవుంటే—అది మన స్వంతమేననీ మన సేవ కోసం ఎల్లవేళలా సంసిద్ధంగావుందనే భావాన్ని క్షణక్షణమూ రేకెత్తిస్తూవుంటే—దానివిూది చిన్నచూపుకూడా ప్రారంభ మైంది. అయిష్టతతోనే ఇంకా ఎంతకాలం దీన్ని భరించాలనే భయం కలగకపోలేదు. యీ పీడవొదిలే మార్గంకూడా తోచకుండావుంది.

ఏమైనా పక్కింటివారు కిమ్మనటంలేదు. పగలు నాభార్య ఇరుగుపొరుగు అమ్మలక్కలకు వినోదార్థం ఫోను వేస్తూండ టంవల్ల పగలుకూడా పక్కింటివారికేమీ అవకాశం చిక్క టంలేదు. వాళ్ళఫోను యీపాటికి బూజు పడుతూండి వుంటుంది.

మరోనెల గడిచింది. ప్రతిరాత్రీ యీ పాడుడ్యూటీతో ఫోనంటే రోత పుడుతూవుంది. ఇంకోరికి హానిచేసేందుకుగాను ఫోను వెయ్యాల్సి వొస్తోంది కాని, మా ఆనందంకోసం కాదాయె!

ఒకనాటి సాయంత్రం ఇంటికివొచ్చేప్పటికి మా ఆవిడ ముఖంలో ఆందోళన స్ఫుటంగా కనిపించింది. విషయం ఏమిటోనని అడిగాను.

'గ్రామఫోను—' అని ఊరుకుంది.

"మరామ్మతులకు ఎదురు చూడటం లేదుకదా?" అన్నాను.

"మన ఫోనుసంగతికాదు...పక్కింటివారు ఫోను అమ్మే శారుట !"

"దానికి మనకేం విచారం ?"

"అదికాదు...ఎందుకు అమ్మారని నేను అడిగాను. ద్దానికి ఆమె ఏంజవాబు చెప్పిందో తెలుసా ? ప్రతిరాత్రీ మనం ఫోనుచేస్తూంటే దమ్మిడీ ఖర్చులేకుండా శ్రమయేమీ పడకుండానే వాళ్ళు వింటున్నారుట ! పిల్లలుకూడా గోల చేయకుండా నిద్రపోతున్నారుట. మనది చాలా మంచిఫోను కావటంవల్ల వాళ్ళఫోనుతో కలగని కొత్త ఆనందాన్ని అనుభవించ గలుగుతున్నారుట!...తమ ఫోను పూర్తిగా తుప్పు పట్టకపూర్వమే వొదిలించుకున్నారట!"

నా గురి ఇంతఘోరంగా తప్పిపోయినందుకు ఎంతో విచారం కలిగింది. వాళ్ళు మమ్మల్నిచూసి యీర్ష్యపడటం లేదు. మేము నిరూపించిన యీర్ష్యనుమాత్రం తమకు అనుకూలంగా ఉండేట్టు ఉపయోగించుకో గలిగారు. ఇంతకూ ఫోను కొనమని నన్ను వేధించిన భార్యమీద నాకు కోపం వొచ్చింది.

"నీమూలానే వెధవఫోను కొన్నాను. వాళ్ళఫోను రోజూ వింటూంటే సరిపోతుందని ఎంత చెప్పినా నువ్వు వినలేదు... నీకన్నా ఆమె ఎంతో తెలివైంది. మనచేత ఫోను కొనిపించి మన ఖర్చుమీద ఆమె సకుటుంబముగా ఆనందిస్తోంది. మన మూర్ఖత్వాన్నీ అమాయకత్వాన్నీ ఆమె సక్రమ

మార్గంలో ఉపయోగించుకుంది. ఎంత తెలివిగలది!''
అన్నాను.

''నామీద విరుచుకుపడితే ఏంలాభం? ఫోను వాళ్ళది కనుక వాళ్లు అమ్ముకున్నారు—దానికి నేనేంచేసేదీ? పోనీ వాళ్ళు మనను ప్రతిరోజూ ఏడుగంటలకల్లా ఫోను చెయ్యమని బతిమాలలేదు; భంగపడలేదు. మీఅంతట మీరే రోజూ ఆపని చేస్తున్నారు. వాళ్లు హాయిగా వింటున్నారంటే—మనది ఎంతో మంచిఫోను కావటంవల్ల—శబ్దం నిర్దుష్టంగా ఎక్కువ దూరం వినిపిస్తూండటంవల్ల! మీరు తప్ప ఇంకెవ్వరూ వినకుండా మీరే ఏదన్నా ఉపాయం చూసుకోండి!''
అందామె.

దీనికోసం సౌండ్ ప్రూఫ్ ఇల్లు కట్టించుకోవాల్సి వచ్చేట్టుంది! నాకింకేమీ ఉపాయం తోచటంలేదు.

కాస్త ఆగి ఆమె అంది: ''పోనీ వెధవఫోను అమ్మెయ్యండి!''

—అక్టోబర్ 1947

# న్యాయం - ధర్మం

ఉద్యోగం లేకపోయినా పెద్దలు సంపాదించి ఇచ్చిన ఆస్తి పాస్తులతో చీకూచింతా లేకుండా కాలక్షేపం చేయగలుగు తున్నా. ఐతే వేరేపనేమీ లేదని, ఇతరులపనుల్లోకి తల దూర్చటం నాకు మొదటినుంచీ తలనొప్పిగానే వుండేది. ఎందువల్లనోకాని ఆ 'ఇతరులు' కూడా నన్ను బాధించేవారు కాదు. బహుశా వారి రాజకీయాలకు నేను పనికిరాని వాణ్ణనే నిశ్చయానికి వారు వొచ్చి ఉండాలి.

ఒకనాడు అతాత్తుగా వెంకయ్య నాకోసం ఎంతో ఆత్ర తతో వొచ్చాడు. పరిచయమున్నా స్నేహంలేనివ్యక్తి వొచ్చా డంటే పెద్దపనిపెట్టుకొనే వొచ్చివుంటా డనేది స్పష్టంగా తెలుస్తూనే వుంది. మర్యాదచేసి కూర్చోమన్నాను. కాని ఎంతో వినయ విధేయతలతో నమస్కరించి నిలబడే వున్నాడు. నాకు తెలియని గొప్పతనాన్ని దేన్నో వెంకయ్య నాకు స్పష్టీకరిస్తున్నాడనే గర్వంతో కూడిన ఆనందం నాలో తొణికిసలాడింది. అతన్ని బలవంతాన కూర్చోబెట్టి నాఆనం దాన్ని తగ్గించుకోనటం ఉచితంగా తోచలేదు.

''ఏమిటి విశేషం?'' అన్నాను.

''మీరు న్యాయం ధర్మం చెపతారని వొచ్చాను.'' అన్నాడు వెంకయ్య.

ఏ వైకమో అప్పు అడుగుతాడేమోనని భయపడుతూన్న నాకు, పరమానంద మైంది. వూళ్ళో పేరువున్న వ్యవహార వేత్త. ఎన్నో తీర్పులు చెప్పగలిగిన సమర్థుడు—వెంకయ్య నాదగ్గిర న్యాయం, ధర్మం దొరుకుతుందని రావటమంటే, ఇన్నాళ్ళుగా నేను గుర్తించలేని ఒక అజ్ఞాతశక్తిని మేల్కొల్పి నట్లయింది.

దూరం ఆలోచిస్తే నాకు తెలివితేటలకు తక్కువేముంది? నా స్నేహితుల్లో చాలామంది పూర్వీకుల ఆస్థిని తగలేశారు. నేనుమాత్రం ఆస్తిని పెంచలేకపోయినా, ఉన్నదాన్ని జాగ్రత్తగా పట్టుకొస్తూనే వున్నాను. అదీగాక నేను తెలివి లేనివాణ్ణనేమాట ఎవ్వరూ ఎప్పుడూ అనుకోలేదు; నేనే నమ్మలేనుకూడాను. న్యాయం ధర్మం చెప్పగలశక్తి నాలో అణిగి మణిగి వుంది; దాన్ని నే నింతవరకూ గుర్తించలేదు. ఏ అనామకుడో యీమాటఅంటే నేను లెక్కచేసి వుండే వాణ్ణికాదు. సర్వసమర్థుడు వెంకయ్యే ఆమాట అంటే నాలోని శక్తి సామర్థ్యాలు చాలా గొప్పవై వుండాలి. నేను పెద్దమనిషిని కనుకనే వెంకయ్యలాటివాడు నా సహాయాన్ని అర్థించాడు. నాకు వొళ్ళు పరవశమై "అసలు సంగతేమిటి?" అన్నాను.

"మన శంకరయ్య లేడండీ—వాడివిషయం..."

"అదే ఏమిటంట?" అన్నాను ఉద్రేకాన్ని తగ్గించు కొని; ఎందుకంటే ఏపొలం తగాదాయో ఐతే కొట్లాటలు

వరకూ వెళ్ళటం కష్టం; మధ్యలో తలదూర్చి సుభవార్త కన్నీళ్లు కట్టించుకోవటం నాకు ఇష్టంలేదు!

''ఏం చెప్పమంటారండీ—మూడేళ్ళక్రితం శంకరయ్యదగ్గర నాలుగొందలు అప్పు తీసుకున్నాను ఈ నాటికి అది వడ్డీతో ఐదువొందలపైచిలు కయింది. ఇప్పుడు ఆ డబ్బంతా కక్కమంటాడు. నాకు మరో రెండు నెలలన్నా వ్యవధి యిప్పిస్తే కాని నేను తీర్చలేను...తమబోటి పెద్దలు చెపితేకాని అతను వొప్పుకునేట్లులేదు. నన్ను యీ ఆపదనుంచి కాపాడండి,

వెంకయ్య చెప్పింది చాలా సబబుగానే తోచింది. ఉన్న పళాన కక్కమంటే యెవడితరమౌతుంది? కొద్ది వ్యవధి ఇస్తే—శంకరయ్యచేత నేను—నాలాంటి పెద్దమనిషి—యిప్పించ గలుగుతే వెంకయ్య ఒక వొడ్డున పడతాడు. ఇందులో మాటసహాయంచేస్తే సరిపోతుంది. అది న్యాయంకూడాను. ఐతే శంకరయ్యతో కొంత ఘర్షణపడి వ్యవహారం ముదిరాకనే వెంకయ్య నాదగ్గిరికి వొచ్చివుంటాడు. ఈ చెడిన వ్యవహారాన్ని ఒక మార్గాన పెట్టటం కష్టమే! కాని నాలో నాకులేని నమ్మకాన్ని వెంకయ్య ప్రవేశపెట్టాడు. ఆ నమ్మకంతోనే నేను యీ సమస్యను పిడదియ్యగల శక్తిని పొందానేమో?

కాని వెంకయ్య నా తీర్పును శిరసా వహించేందుకు సిద్ధమైనా మరి శంకరయ్య సంగతేమిటి? వెంకయ్య నాలో

చూడగలిగిన సద్గుణపరంపరను శంకరయ్య గుర్తించాలి కదా! అలా కానిపక్షంలో వెంకయ్య నాకు అంటగట్టిన పెద్దమనిషితనం, న్యాయధర్మ పరిశీలన నగైశాలకు పెద్ద దెబ్బ తగులుతుంది! అంటే శంకరయ్యను ఏదోవిధంగా మనదారికి లాక్కొని కేవలం నా గొప్పతనాన్ని ఒప్పుకునేందుకు ప్రయత్నం చేయాలి. వెంకయ్యకు సహాయం చేయటం మాట అటుంచి, నా న్యాయబుద్ధిని విస్తరించటానికే నేను విశ్వప్రయత్నం చేయవలసివుంది. అది తప్పనిసరిగా నేతోచింది.

"మరి శంకరయ్య మనమాట వింటాడా?" అన్నాను. సందేహానికి వొచ్చే సమాధానంలోనే ముందు కార్య క్రమాన్ని నిర్ణయించుకునేందుకు వీలుగా.

"వింటాడా—అని మెల్లిగా అంటున్నారా? మీలాంటి పెద్దమనిషి చెపితే కాదనేందుకు శంకరయ్యకు గుండేనా?"

బాగానేవుంది. గొప్పతనమనేది గుర్తించబడకుండా ఎలా వుంటుంది కనుక? ఐతే యీ శంకరయ్యకోసం నేనే వెళ్ళటం హాస్యాస్పదం; అది కేవలం వెంకయ్యను వెనకేసుకొని వెళ్ళటమే అవుతుంది. న్యాయం, ధర్మం చెప్పవలసినవాడు ఆ విధంగా ప్రవర్తించడుకదా? అదీగాక శంకరయ్య నేను చెప్పిన తీర్పును ఒప్పుకుతీరుతాడని వెంకయ్య అంటున్నాడే కాని, తీరా అక్కడికి వెళ్ళాక యెదురుతిరుగుతే ఆ అవమానానికి నేను యెంతగానో బాధపడాల్సి వుంటుంది.

కనుక శంకరయ్యే నాదగ్గిరికి రావటం అన్నివిధాలా, అందరికీ మంచిది. నామాట ఒప్పుకునేందుకు సిద్ధపడితేనే తప్ప శంకరయ్య నాదగ్గిరికిరాడు; శంకరయ్య నాదగ్గిరికి వొచ్చేట్టు చేయటం వెంకయ్యవిధి; ఇది నా పెద్దమనిషితనాన్ని నిరూపించేందుకు కాదు— వెంకయ్యకుస్వలాభం యోచించికనుక!

''శంకరయ్యను ఇక్కడికి కొట్టుకొని రాగలవా మరి?'' అని అడిగాను.

''తమ సెలవైతే క్షణంలో రాడూ?''

''సరే ఐతే—''

వెంకయ్య విప్పారిన మొహంతో వెళ్ళిపోయాడు. నేను ఆలోచనలో పడ్డాను. గొప్పవాడి గొప్పతనాన్ని ముందు గుర్తించేది ఇతరులు. ఎవడికైనాసరే తన మొహంతప్ప ఇతరుల మొహాలన్నీ కనిపించినట్లే- తన శక్తి సామర్థ్యాలు తప్ప ఇతరులశక్తి సామర్థ్యాలే ముందుగా కనిపిస్తవి. నేటి. నా నిజమైన విలువ బైటపడే వాతావరణం ఏర్పడబోతున్నందుకు ఎంతో గర్వం కలిగింది.

శంకరయ్యతో ఏవిధంగా మాట్లాడాలో ఆలోచించుకోక ముందే శంకరయ్య వొచ్చాడు; వొస్తూనే నమస్కరించాడు కి అరె! నామాటఅంటే వీళ్ళకు ఎంతగౌరవం—నేనంటే ఎంత అభిమానం: ఒళ్ళు తెలియనంతపనై తమాయించుకున్నాను.

''ఏం శంకరయ్యా — బాగున్నావా?'' అన్నాను. ముందు కాస్త దువ్వి మచ్చికచేద్దామని.

"తమ దయవల్ల బాగానే వున్నానండీ!" అన్నాడు శంకరయ్య. "ఎందుకో పిలిపించారట—" అన్నాడు వెంటనే- నేను చెప్పబోయ్యేది శిరసావహించేందుకు సిద్ధంగా ఉన్నవాడల్లే.

"ఏంలేదు—మన వెంకయ్య విషయం..." అని నీళ్ళు నమిలాను.

"ఏం చెయ్యమంటారు? ఎన్నివాయిదాలు ఇచ్చినా బాకీ చెల్లించటంలేదు. డబ్బుకు కిటకిటగావుంది. ఆతని అవసరాన్ని నేను తీర్చాను; మరి నా అవసరానికి లేకుండా పోతే ఎట్లా చెప్పండి...మీరే న్యాయం ధర్మం చెప్పండి" అన్నాడు శంకరయ్య వినయంగా.

నేను చెప్పబోయ్యే న్యాయం, ధర్మంకోసం ప్రతివాదులు నిలబడి ఉండటం చూసేప్పటికి, నా గొప్పతనం అర్థమై తల దిమ్మెక్కింది. ఎలాగైనాసరే శంకరయ్యకు నచ్చచెపితేనే కాని నా ధర్మబుద్ధి నిరూపణ అవదు.

"అదిసరే. శంకరయ్యా...ఎలాగూ మూడేళ్ళు ఆగావు. మరో రెండునెలలు ఆగు..."

"ఇంకానా?" అన్నాడు శంకరయ్య నిట్టూరుస్తూ.

"రెండునెలలకు పంటవొస్తుంది. తీర్చుకుంటాను" అన్నాడు వెంకయ్య.

"ఔను...ఉన్నపళాన ఎలా కుమ్మరిస్తాడు చెప్పు. పంట రాగానే తీరుస్తాడు. వెంకయ్య పెద్దమనిషి" అన్నాను. వెం

కయ్య పెద్దమనిషితనం నాకు అంతబాగా తెలియకపోయినా ఆ వినయవిధేయతలూ, నాబోటి పెద్దల పట్ల అతనుచూపే గౌరవమర్యాదలూ చూస్తే అర్థమౌతూనేవుంది!

"డబ్బుకు చాలా కిటకిటగా వుంది. వెంకయ్య అవసరాన్ని నేను తీర్చాను. నా అవసరానికి కాకుండాపోయింది ..." అని శంకరయ్య చప్పరించాడు.

నా మాటను తోసేస్తాడేమో ననేభయం నన్ను ఆవరించింది. అందుకని అన్నాను; "వెంకయ్య చాలా పెద్దమనిషి. కలిసిరాకపోవటంవల్ల నీ బాకీ తీర్చలేక పోయ్యాడు. నీడబ్బుకేమీ భయంలేదులే"

"రేపు పంటలోమాత్రం యిస్తాడని యేమిటి?" అని శంకరయ్య సవాల్ చేశాడు.

కాస్త సందుపెట్టినందుకు నాకు పరమానందమైంది. ఆలస్యం చేయకుండా అవకాశాన్ని వినియోగించాను.

"నాబోటి పెద్దమనిషిదగ్గిర మాటఅన్నాక తప్పుతాడా వెంకయ్య?" అన్నాను. వెంకయ్య పెద్దమనిషితనానికి సపోర్టుగా నా పెద్దమనిషితనాన్ని నిలబెట్టాను—మరి అంతకన్న మార్గంలేదు.

ఈలోగా సాంబయ్య ఎప్పుడొచ్చాడో కానిఅతనిగొంతు వినేదాకా నేను గుర్తించనేలేదు.

"ఆయన అంతగా చెపుతూంటే "సరే, ననవేం శంకరయ్యా?" అన్నాడు సాంబయ్య. నా పెద్దమనిషి తనాన్ని

పరాయివాడైన సాంబయ్యకూడా గ్రహించినందుకు నాకు పరమానందమైంది.

"సరే తమబోటి పెద్దలమాట కాదనేందుకు నేనెంత వాణ్ణి? పైకం రెండు నెలల్లో యిప్పించాల్సిన బాధ్యత తమది."

"ఓ! అలాగే" అన్నాను, ఇంత తేలిగ్గా పరిష్కారమౌతుందని నేను యెన్నడూ అనుకోలేదు. వ్యవహారవేత్త అవటం యెంత సులభమో అర్థమైంది. నేనుకూడా. వూళ్లో వ్యవహారాలకు మధ్యవర్తిత్వాన్ని సహించేందుకు అర్హత వున్నవాణ్ణే! ఐతే నేడే ఆ అర్హతను శంకరయ్యా, వెంకయ్యా కలిసి నిరూపించారు.

"ఏం, వెంకయ్యా?" అన్నాను.

"రక్షించారు. స్వామీ!" అన్నాడు వెంకయ్యతృప్తిగా.

"మరి సెలవా?" అని శంకరయ్య నమస్కరించి వెళ్ళిపోయ్యాడు.

వెంకయ్య యెప్పుడు జారుకున్నాడో తెలియదు. మొత్తం మీద లోకకళ్యాణార్థం ఒక గొప్పపనిని చేసిన తృప్తితో నిండిపోయింది. నా ఆధిక్యతను తెలుసుకోగలిగిన జ్ఞానకాంతి నాకు దక్కింది. అలాగే ఆలోచిస్తూ పడక కుర్చీలో కళ్ళు మూశాను.

*    *    *    *

క్రమంగా యీ తీర్పును గూర్చి మరిచి పోయ్యాను. మరెవ్వరూ నా తీర్పులకోసం రాకపోవటమే దీనికి కారణమై వుండొచ్చు.

ఒకనాడు వుదయానే శంకరయ్య ప్రత్యక్షమయ్యాడు. మరో తీర్పుకోసం వొచ్చాడేమో ననుకున్నాను.

"చూడండి — వెంకయ్య వ్యవహారం!" అన్నాడు. మొహం చిటచిట లాడుతోంది. ఏదో రసాభాస ఐవుంటుం దని అర్థమౌతూనేవుంది. నేను చెప్పిన తీర్పుకు రెండునెలల వయసు దాటిందని కూడా ఇప్పుడే తెలుసుకున్నాను.

"ఏమైందీ—?" అన్నాను.

"పంట కానూ వచ్చింది..... అమ్ముకొని తిననూ తిన్నాడు—"

నాకు వొళ్ళుమండింది. వెంకయ్య ఇంత నీచంగా ప్రవర్తి స్తాడనుకోలేదు. ఏదో మంచివాడని, పెద్దమనిషని నేను అతనిపక్షాన పోరాడి వ్యవధిఇప్పిస్తే యీ విధంగా దుర్వి నియోగ పరుస్తాడనుకోలేదు. శంకరయ్య నిజంగా పెద్ద మనిషి కనుకనే నేను చెప్పిన తీర్పుకు బద్ధుడై వున్నాడు. నా తీర్పును తృణీకరించి నన్ను అవమానించిందల్లా— వెంకయ్య!

"కనుక్కుంటాను, ఆగు." అన్నాను.

"కనుక్కోనటంకాదు... తేల్చెయ్యండి."

"సరే" అన్నాను తప్పక.

వెంకయ్యకోసం కబురుచేశాను, రాలేదు, ఎన్ని కబుర్లు చేసినా టలాయిస్తున్నాడు. అతను రాకపోవటమే అతని కల్మషాత్మకు నిదర్శనం. శంకరయ్యపోరు జాస్తయింది. మరో మార్గం లేక నేనే వెంకయ్య ఇంటికి బయల్దేరాను.

అష్టకష్టాలూపడి వెంకయ్యను వెదకి పట్టుకున్నాను.

"ఏం ఇలా చేశావ్?" అన్నాను కోపంతో.

"ఏం చెయ్యమంటారు—పంటలో అనుకున్నంత రాలేదు. ఇంటి ఖర్చులు అనుకోకుండా పెరిగిపోయినవి. పై పంటలో తప్పక తీరుస్తాను." అన్నాడు.

ఇదేమిటి—ఇలా చేస్తాడని నే నెన్నడూ అనుకోలేదు. యీ సంగతి శంకరయ్యకు చెప్పి ఒప్పించటం సాధ్యమా? యీ రెండు నెలల గడువుకే నా చాకచక్యాన్నంతటినీ ఉపయోగించాను. ఇప్పుడు మళ్ళీ గడువిప్పించటం నాకు తలకు మించినపని. పోనీ ఆ ప్రయత్నం తరువాత చేయవచ్చు. ముందు యీ వెంకయ్య ప్రవర్తనను గూర్చి విచారణ జరగాల్సిందే!

"ఇదేం బాగాలేదు, వెంకయ్యా—" అన్నాను శాస్త్రోక్తంగానే: కారం రాచుకున్నట్లు ప్రవర్తిస్తే అసలుకే మోసం వొస్తుందనే భయంతో ముళ్ళమీద ఆరేసినబట్టను తీసేప్పుడు ఉపయోగించే జాగ్రత్తను మరిచిపోలేదు.

"శంకరయ్యను ఒప్పించగలమా?"

"తమబోటి పెద్దలు చెబితే తప్పక ఒప్పుకుంటాడు..." అని నసిగాడు.

ఏమని చెప్పి ఒప్పించేది? నన్ను పెద్దమనిషిగా, మధ్యవర్తిగావుంచి, యీ స్థితికి దింపాడు. ఇంకా గట్టిగా ఇప్పిస్తే మిగిలివున్న యీ కాస్త పెద్దమనిషి తనంకూడా హరించుకొని పోతుంది.

వెంకయ్యమీద విసుక్కున్నాను. కోప్పడ్డాను. రెండు మూడు దూషణ వాక్యాలుకూడా ఉపయోగించాను. కాని వెంకయ్యలో చలనంలేదు; వాంచినతల ఎత్తలేదు. నోరు నొప్పిపెట్టి ఇంటిదారి పట్టాను.

శంకరయ్య నాకోసమే కాచుకొని కూర్చున్నాడు. అసలే విసుగ్గావున్న సమయంలో యీ భ్రాష్టుడు ఎదురవటం వొంటిమీద గొంగళీపురుగులు పాకట మల్లేనేవుంది. ఐనా తమాయించుకున్నాను.

"ఏమైందీ?" అన్నాడు శంకరయ్య.

"పై పంటకు ఇస్తానంటాడు!" అన్నాను.

"ఏమండీ—మీరు చెప్పబట్టి వూరుకున్నాను. ఏం చేశాడో చూశారుగా! పెద్దమనిషన్నారే."

"మరి ఏంచేద్దామంటావు?" అన్నాను రాజీగా.

"నా పైకం ఇప్పించండి—"

"ఎలాగంట ?"

"శంకరయ్యా! వెంకయ్య పైకం ఇచ్చేట్లుగా ప్రయత్నం చేస్తాను కాని అది కాకపోతే నీ అవస్థ నువ్వేపడి మీ రిద్దరూ కట్టకట్టుకొని గంగలో దూకండి. అంతే కాని నేనేం చేసేదీ?" అన్నాను.

"ఈనాడు మీరు చేతులు కడుక్కుంటే సరిపోతుందను కున్నారా? ఆనాడు మీరు మాట అడ్డంవేయకుంటే నేనీ యేం చేసుకునేవాణ్ణో మీకు అనవసరం. మీ బాధ్యతను యింత తేలిగ్గా మరిచిపోతారనుకోలేదు—"

నాకు కారం రాచినట్లయింది.

"ఏమిటి నీ వుద్దేశ్యం?" అన్నాను నిలవదీసి.

"ఏ పెద్దమనిషి కన్నా చెప్పండి—యేమంటాడో!" అన్నాడు శంకరయ్య.

నేనే ఒక పెద్దమనిషినై వుండి, ఇంకో పెద్దమనిషికోసం వెళ్ళటంకన్న తలవొంపులు వుండబోదు. ఐతే లోగడ పెద్ద మనిషితనాన్ని డబ్బు ఖర్చు లేకుండా, సంపాయించాను. ఇప్పుడు ఆ పెద్దమనిషితనాన్ని నిలబెట్టుకునేందుకు వెంకయ్య బాకీని నేనే చెల్లించవలసిన పరిస్థితి యేర్పడింది. ఎప్పుడైతే 'డబ్బు' ఇందులో ఇరికిందో కాస్త దూరంగా వుండటమే శ్రేయస్కరంగాతోచి "అది నావల్ల కాదు—"అన్నాను.

"ఆరోజున సాంబయ్యగారుకూడా వున్నారు. ఆయన్ని చెప్పమనండి." అన్నాడు శంకరయ్య,

"ఆయన చెప్పటమేమిటి?" అన్నాను కోపంతో వాణికి పోతూ.

"ఆనాడు ఆయనకూడా వున్నారుగా! మీరేదో నాగ కాడతామని చేసిన వాగ్దానాన్ని ఆయన మరిచిపోయి వుండరు——"

"నాకు యెవరి అభిప్రాయాలతోనూ పనిలేదు." అని, జవాబుకు యెదురు చూడకుండానే లోనికి వెళ్ళిపోయాను.

అరగంట గడిచేప్పటికి, సాంబయ్యతో సహా శంకరయ్య ఇంటిముందు దిగాడు. ఇందాకటి మంట తగ్గకముందే మళ్లీ రభస ప్రారంభం.

"ఏమండీ, సాంబయ్యగారూ!" అన్నాను.

"ఏంలేదు...ఆనాడు జరిగినదానికి సాక్ష్యంగా శంకరయ్య నన్ను తీసుకొచ్చాడు."

"చూడండి—ఆడబ్బు నన్ను ఇచ్చుకోమంటాడు; యిదేం న్యాయం, స్వామీ?" అన్నాను.

"మీరివ్వటం కాదుకానండి, ఇప్పించాల్సిన బాధ్యత మాత్రం తమదే!"

నాకు వచ్చినంత పనైంది. రెండు అభోతులమధ్యా ఇరుక్కున్న లేగదూడస్థితిలో పడ్డాను.

"అలాగైతే పైపంట దాకా ఆగమనండి." అన్నాను. ఓడిపోయ్యే కేసును ఏదోవిధంగా సరిచేసేందుకుగాను ప్రయత్నించే లాయరు లాగు.

"ఎట్లా? మీరు రెండు నెలలు వాయిదా ఇప్పించారు: అంతవరకూ ఆగనే ఆగాడు," అన్నాడు సాంబయ్య.

అటుతిరిగీ ఇటుతిరిగీ ఇది నామెడకే చుట్టుకుంది. తీర్పు చెప్పిన న్యాయాధికారికి ఆ తీర్పును అమలుజరిపేందుకు పోలీసుల సహాయం ఉంటుంది. నాకు అలాంటి అవకాశాలేమీ లేవు.

"నన్ను ఏం చేయమంటారు?" అన్నాను సగం చచ్చి.

"అతనిచేత ఇప్పించండి. లేదా ఆపైకం మీరే ఇచ్చుకొని వెంకయ్య దగ్గర వసూలు చేసుకోండి" అన్నాడు శంకరయ్య.

నిస్సహాయంగా సాంబయ్య మొహంవొంక చూశాను, సాంబయ్య "అంతే" అన్నట్టు తల ఆడించాడు.

వెంకయ్య దగ్గర వసూలుచేసి ఇవ్వటం నాకు మించిన పని! శంకరయ్యలాంటి వాడికే సాధ్యమనలేదు. పోతే నేను ఇచ్చుకోవడం ఒక్కటే మిగిలింది. సాంబయ్యలాటివాడు కూడా శంకరయ్య వైపే మొగ్గుతున్నాడు. ఊళ్లో ఇంకెవరి దగ్గరకి వెళ్ళినా ఇంతకుమించిన న్యాయం దొరుకుతుందనే నమ్మకం నాకు కలగటంలేదు. పైపెచ్చు నేనుచేసిన వెధవ పనినికూడా విమర్శిస్తారు. నా పెద్దమనిషితనాన్ని నిలబెట్టుకునేందుకుగాను రభస కాకుండా చూచుకోవటం అవసరమైంది.

"సరే. చూస్తాను" అన్నాను.

"చూడటంకాదు; రెండురోజుల్లో నా పైకం ఇప్పించాలి" అని ఇద్దరూ వెళ్ళిపోయారు.

'ఇప్పించాలి' అంటే 'ఇవ్వ' అనటమే! రెండురోజుల్లోనూ వెంకయ్య వెంటపడ్డానుకాని ప్రయోజనంలేకపోయింది. చూస్తూండగానే గోళ్లూడగొట్టినట్లు, శంకరయ్య పదునందంగా వసూలుచేసుకొని వెళ్లాడు.

వారం గడవకముందే వెంకయ్యా శంకరయ్యా ఎంతో స్నేహంగా జల్సాగా పట్టణానికి బయలుదేరారని తెలిసింది. అది మొదలుగా ఇంత ఖరీదైన యీ పెద్దమనిషితనాన్ని — న్యాయం, ధర్మం తెలిసిన నేను మరెన్నడూ దాన్ని వినియోగించ కూడదని నిశ్చయించుకున్నాను.

—నవంబర్, 1952